# పంజరం (నాటకం)




బు
159

1550
ఋ-159

# పంజరం

(నాటకం)

ఋ/159



అవసరాల సూర్యారావు



విశాలాంధ్ర ప్రచురణాలయం
విజయవాడ.

3 21/59

# కానుక

మిత్రులు, ఉత్తమ నటులు,

శ్రీ జె. వి. సోమయాజులు, శ్రీ జె. వి. రమణమూర్తిగారలకు

ఈ నాటకం నా కానుక !

ప్రప్రథమంగా, ఈ నాటకాన్ని 1956 ఏప్రియల్‌లో, విజయనగరంలో జరిగిన రాఘవ నాటకోత్సవ పోటీలలో శ్రీ నటరాజ కళా సమితి, శ్రీకాకుళంవారు ప్రదర్శించారు. రంగాలంకరణకు, ఉత్తమ నటికి ప్రథమ బహుమతులు. ప్రదర్శనకు ద్వితీయ బహుమతి దీనికి లభించాయి. అదే నాటక సమాజంవారు, 1958 జూన్‌లో గుడివాడలో జరిగిన ఆంధ్రనాటక కళాపరిషత్తు పోటీలలో పాల్గొన్నారు. పరిషత్తు పోటీలలో ఉత్తమ రచనకు, రంగాలంకరణకు ప్రథమ బహుమతులు, ప్రదర్శనకు ద్వితీయ బహుమతి, డాక్టర్ శ్రీరామ్ పిచ్చివాని పాత్రధారులకు ప్రత్యేక బహుమతులు సిద్ధించాయి. 1958 జనవరిలో థియేటరు సెంటర్ యాజమాన్యాన హైద్రాబాద్‌లో జరిగిన నాటక పోటీలలో రాఘవ కళాసమితి, కాకినాడవారు ప్రదర్శించగా, ఉత్తమనటికి ప్రథమ బహుమతి వచ్చింది. వాల్తేరులో ఆంధ్ర విశ్వకళా పరిషత్తు ఆధ్వర్యాన 1956 లో జరిగిన. వివిధ కళాశాలల నాటకపోటీలలో విశాఖపట్టణం వైద్యకళాశాల విద్యార్థులు దీనిని అభినయించారు. ఉత్తమ ప్రదర్శనకు, రంగాలంకరణకు, ఉత్తమ నటునకు. ప్రథమ బహుమతులు, దత్తాత్రేయ పాత్రధారికి ప్రత్యేక బహుమతి లభించాయి. 1958 మార్చిలో జరిగిన నాటక వారోత్సవాలలో ఆలిండియా రేడియో, విజయవాడ కేంద్రంవారు దీనిని ప్రసారం చేశారు. ప్రయోక్త: శ్రీ బందా కనక లింగేశ్వరరావుగారు.

పంజరం నాటకాన్ని ప్రదర్శించిన నాటక సమాజాల వారికి, ఆదరించిన సదస్సులకు, పరిషత్తుల పెద్దలకు, ప్రసారంచేసిన ఆలిండియా రేడియో, విజయవాడ కేంద్రంవారికి, పలువిధాల ప్రోత్సహించిన శ్రీ దుర్గా గంగరాజు, పూసపాటి కృష్ణంరాజు, పంతుల జోగారావు,

డాక్టర్ బి. వి. సంజీవరావు, కానుకుర్తి వెంకట రమణరావు, రామకృష్ణం నాయుడు, సోదరుడు, చిరంజీవిరావు వంటి మిత్రబృందానికి. ముఖచిత్రం వ్రాసియిచ్చిన విజయనగరం ఆర్ట్సుస్కూలు ప్రిన్సిపాల్ శ్రీ అ. పైడిరాజుగారికి, ప్రచురించి చేయూతనిస్తున్న విశాలాంధ్ర ప్రచురణాలయం. వారికి రచయిత సదా కృతజ్ఞుడు.

ఈ నాటకాన్ని ప్రదర్శించడానికి
రచయిత లిఖితానుమతి అవసరం.

—అవసరాల



## ప్రప్రథమ ప్రదర్శకులు

| | | |
|---|---|---|
| డాక్టర్ శ్రీరామ్ | : | శ్రీ జె. వి. సోమయాజులు |
| పిచ్చివాడు | : | శ్రీ జె. వి. రమణమూర్తి |
| శ్రీనివాసరావు | : | శ్రీ జోగారావు |
| దత్తాత్రేయుడు | : | శ్రీ రావి కొండలరావు |
| ప్రకాశరావు | : | శ్రీ శ్రీహరిరావు |
| జాన్ | : | శ్రీ జె. వి. రాముడు |
| ఛాయ | : | శ్రీమతి నిర్మల |

| | | |
|---|---|---|
| దర్శకత్వం | : | శ్రీ జె. వి. రమణమూర్తి |
| రంగాలంకరణ | : | శ్రీ కుమార్ |
| నిర్మాత | : | శ్రీ అప్పారావు దొర |
| సమాజం | : | శ్రీ నటరాజ కళాసమితి, శ్రీకాకుళం. |

TPLA121 B D200
20159
5

# పంజరం

## ప్రథమాంకం

సమయం: ఉదయం

స్థలం: ఒక నగరంలో డాక్టర్ శ్రీరామ్ అద్దెకు వుంటున్న భవనం.

భవనంలో విశాలమైన హాలు, గోడలకు అటుఇటు రెండు తైలవర్ణ చిత్రాలు; పుస్తకాల అల్మైరాలు, కుడిప్రక్క మధ్య ఒక టేబిల్; కుర్చీలు. కింద కాగితాల బుట్ట. దూరంగా ఒకమూలకు ఎత్తయిన పీఠంమీద, పాలరాతి బుద్ధుని ప్రతిమ, కొంచెం ప్రక్కగా మేడ మెట్లు, ఎదుట ఒక గాజు కిటికీ, కిటికీ అవతల పూలతోట. ఎడమవైపు ఒక చిన్న టేబులు, కుర్చీ, టేబిల్ మీద ఫోను. ఫోనుకు కొద్ది దూరంలో, మీదను వ్రేలాడుతున్న పంజరం; పంజరంలో రామచిలుక.

తెర లేచేసరికి, జ్యోతి గబగబ వీధి గుమ్మంవైపు వెళ్ళి వెనక్కి వస్తుంది; అటు ఇటు కంగారుగా తిరుగుతూ వుంటుంది.

జ్యోతి: (కలవరపడుతూ) జాన్! జాన్!

జాన్: (చేత్తో బ్రష్ పట్టుకున్నాడు; వ్రేళ్ళకు తెల్లని రంగు అంటుకొని వుంది. తొందరగా వస్తూనే) ఏవమ్మగారూ?

జ్యోతి : వెళ్లు – దబ్బున వెళ్లు. ఆయన్నిలా పిలు !

జాన్ : ఎవర్నండమ్మగారూ ?

జ్యోతి : ఇప్పుడొచ్చాడే అతన్ని. ఇంకా వీధిమలుపు తిరిగి వుండడు. త్వరగా వెళ్లు.

జాన్ ! (వీధివైపువెళ్ళి అప్పుడే తిరిగి వచ్చి) వీధిలో, ఒకరా, యిద్దరా ! చాలామంది వెళ్తున్నారు. ఎవరిని పిలవ నమ్మ గారూ ?

జ్యోతి : అయ్యో, నామతి ! అవున్లే ఎవర్నని పిలుస్తావ్ ! ఇంతకీ ఆ వచ్చినమనిషి ఎలా వున్నాడో నువ్వు చూడనూ లేదు. నేను చెప్పనూలేదు. అబ్బ ! వీళ్లేం మనుషులురా ? డబ్బంటే కొండమీద కోతి దిగొస్తుం దనుకుంటారు. ఏ పనైనా, ఇట్టే చెయ్యొచ్చు ననుకొంటారు. "ఇవాళ శుక్రవారంట. ఇంటి కొచ్చిన లక్ష్మిని కాలితో తన్నుకో కూడదట"! అంటూ వద్దువద్దంటున్నా ఆ పాపిష్టిడబ్బు డ్రాయరుమీద పెట్టి వెళ్ళి పోయాడు.

జాన్ : అమ్మయ్య ! అంతేకద ! ఏమిటో అనుకుని గాభరా పడ్డాను.

జ్యోతి : ఆ నోట్లు తీసి జాగ్రత్తపెట్టు ! అయ్యగారొచ్చాక అతనికి పంపించేద్దాం !

జాన్ : పంపించడ మెందుకండీ ? పిచ్చివాడు కాబోలు, అయ్యగారి దగ్గరకి మందుకోసం వచ్చుంటాడు.

జ్యోతి : నీ తెలివి తెల్లారినట్లే వుంది. పిచ్చివాడెవడైనా మందుకొస్తాడా ?

జాన్ : ఎందుకు రాకూడదు? లోకంలో రకరకాల పిచ్చి వాళ్లున్నారు. ఎవరికేరకం పిచ్చుంటుదో మనకేం తెలుస్తుంది. డాక్టర్లకి తెలియాలిగాని.

జ్యోతి : కాని యిలాంటి పిచ్చివాణ్ణి నే నెక్కడా చూడలేదు.

జాన్ : అయ్యగారు బోలెడంతమందిని చూశారు. అందుకే గదా బాబుగారీ ఆసుపత్రి పెట్టిందగ్గర్నుంచి మాకు బాగు చెయ్యమంటే మాకు బాగుచెయ్యమని రోజూ ఎంత మంది రానడంలేదు?

జ్యోతి : కాని యిప్పుడొచ్చిన మనిషి వేరు. అతని తరహాయే వేరు.

జాన్ : వాణ్ణి మనిషంటారేమిటి మీరు! పిచ్చివాడు!

జ్యోతి : అతనికేం పిచ్చి? వద్దు వద్దంటున్నా ఆ రెండు కట్టలూ బల్ల మీద పారేసిపోయాడు!

జా : వద్దు వద్దంటే అంత డబ్బిచ్చేవాడికి పిచ్చి కాక, వెర్రి కాక మరేమిటండీ?

జ్యో : వాడికి పిచ్చేవుంటే నా దగ్గరకెందుకు వస్తాడు?

జా : అవునండోయ్! సరాసరి అయ్యగారి దగ్గరకే వెళ్ళేవాడు.

జ్యో : ఏ పిచ్చివాడైనా తన పిచ్చి కుదర్చమని డాక్టర్ల దగ్గరకు వెళ్తాడా?

జా : వెళ్లడంటారా? ... వెళ్లినా రేటు మాట్లాడుకోలేడు. వీడు అది కూడా మాట్లాడుకున్నాడు... అదీ ఒకరకం పిచ్చేనేమో అమ్మగారూ?

జ్యో : అవును. ఇదో కొత్తరకం ఉన్మాదం... పాపం, అతని తమ్ముడికి మతిచెడిపోయిందిట !

జా : అయితే తమ్ముడి జబ్బు త్వరగా నయంచేయమని వచ్చి వుంటాడు.

జ్యో : ఊహుఁ. తమ్ముడిజబ్బు నయంచేయడానికి అయ్యగారే వెయ్యిరూపాయల కొప్పుకున్నారట. తమ్ముడికి బాగుచెయ్యొద్దని అయ్యగారికి నన్ను సిఫారసుచెయ్యమని అన్నగారు రెండువేలు పట్టుకొచ్చాడు... డబ్బంటే నా తల తిరిగిపోతుం దనుకున్నాడు.

జా : తమ్ముడికి మతిచెడిపోతే అన్న కేంలాభమండీ? తమాషాగా వుందే యీ కేసు !

జ్యో : తమాషా కేముంది? తమ్ముడు అమాయకుడు కాబోలు. ఆస్తి బాగా వుందేమో.

జా : భార్య మంచిది కాదేమో?

జ్యో : అబ్బ!...మన కెందుకు... ఎవరి బాధలు వాళ్ళవి... ఎవరి సంసారాల్లో ఏ మున్నాయో !

జా : భలే మనుషులండీ! మంచి కేసులొస్తున్నాయి, అయ్యగారి దగ్గరికి. పిచ్చి కుదర్చమని ఒకడూ, కుదర్చవద్దని యింకొకడూ. రెండువిధాలా ఫీజే... లాయర్లలాగ.

జ్యో : ఏం మనుష్యులు ! ఏం లోకం ! తలుచుకుంటే భయం వేస్తోందిరా? తమ్ముణ్ణి అమాయకుణ్ణి చేసి ఎంతకి తెగించేడు అన్న! నే నలా చెప్పననీ, మందు వేయడానికీ, రోగాలు కుదర్చడానికీ, నేనేం డాక్టర్ని కాదని, ఆ విషయం అయ్యగారితో మాట్లాడుకోమనీ చెప్పాను.

జా: చెబితే పిచ్చిముండాకొడుకు వింటేనా?

జ్యో: అదే మరి. ఏంచెయ్యడమో పాలుపోవడం లేదు.

జా: వెయ్యికంటే రెండువేలు ఎక్కువేకదండి! కుదర్చవద్దని అయ్యగారితో చెబుదాం.

జ్యో: ఆయన నింకా రాలేదేం చెప్మా! వెళ్లి చాలా సేపయింది.

జా: రోగుల్ని చూడ్డానికి వెళ్ళేరు కదండీ.

జ్యో: వెళితే? యింతసేపా!

జా: అన్నట్టు అన్నయ్యగారొక్కసారి రమ్మనమని అంబుజమ్మగారు ఫోను చేశారు. రోగుల్నిచూసి అయ్యగారలా వెళ్ళుంటారు.

జ్యో: ఆవిడకేం పనీపాటూ లేదు! క్లబ్బులూ, పేకాటలూ, బోటుషికార్లూ! అదేవిట్రా! ఆ నవ్వులూ ఆవిడా, అసహ్యం!

జా: ఏమిటోనండి. ఎవరి వెర్రి వాళ్ళకానందం (వెళ్ళబోతాడు).

జ్యో: అవున్లే; మన కెందుకు? ఎవళ్ల గొడవ వాళ్లది. (వెళ్ళబోతున్న జాన్‌ను చూసి) జాన్!

జా: ఏ వమ్మగారూ!

జ్యో: వంట్లో అదోలా వుందిరా. మనసులో దిగులుగా వుంది.

జా: అయ్యగారికి ఫోను చేయనాండీ? అంబుజమ్మగారింట్లో వుంటారేమో!

జ్యో: అక్కర్లేదులే...ఏవిటో పుస్తకాలూ అవీ, చిందరవందరగా!...అబ్బబ్బ దిక్కుమాలిన పేషంట్లు!

జా : సర్దేస్తానండి! ఆ బోర్డు రాయడమైపోయాక యిల్లంతా నీటుగా సర్దేస్తా.

జ్యో : నీ కెన్నిసార్లు చెప్పినా ఒకటే! ఇంట్లో ఆ పంజర మెందుకు? ఆ చెవలపిల్లు లెందుకు? దిక్కుమాలిన రొద! చెబితే వినవు కదా ?

జా : నే నేం చేయను? వాటిని మీా రొదిలేయమంటారు. అయ్యగా రొద్దంటారు.

జ్యో : (వెటకారంగా) ఆఁ—అయ్యగా రొద్దన్నారు! అవంటే నీకే సరదా. పనీపాటు లేకుండా వాటితో ఇంచక్కా ఆడుతూ పాడుతూ కూచుందువుగాని.

జా : మీా రలా అన్నారనే మొన్న వాటిని మూడుమా ర్లొదిలిపెట్టాను. అవి మళ్ళీ మనింటికే హాజరు...అవంటే నాకూ అసహ్యమే. చాకిరీ చెయ్యలేక చచ్చిపోతు న్నాను...బంగాళాముందు కుక్కవుంటే మంచిదికానండీ, యివెందుకండీ దండుగ! ఫ్యాక్టరీ దొరగారింట్లో మా మంచి కుక్క లున్నాయండి. అందులో ఓ కుక్క అల్ సేషన్. సింహాప్పిల్ల. మన బంగాళాలో అదివుంటే బాగుంటుందని అయ్యగారితో చెప్పానండి. అయ్యగా రడిగేరుట! దొరగా రిస్తామన్నారుట.

జ్యో : (నవ్వి) అయితే నీ కింక తీరికే వుండదన్నమాట!

జా : ఇప్పుడుమాత్రం తీరికెక్కడండి? అయ్యగారేదో పని పురమాయిస్తూనే వుంటారు.

జ్యో : ఏమిటి నువ్విప్పుడు చేస్తోన్న పని?

జా : అయ్యగారు బోర్డు రాయమన్నారు. రాస్తూ కూర్చున్నాను. ఇంతలో మీరు పిల్చారు. గబుక్కున చక్కా వచ్చాను. మీరు పిలవకపోతే అప్పుడే అయిపోను. (వెడతాడు)

జ్యో : (కుర్చీలో కూర్చుని పత్రిక చదువుకుంటూ ఉల్కి సగ స్పందన)
జాన్...జాన్ !

జా : (తొందరగా ఓ చేత్తో చిన్నబోర్డు రెండో చేత్తో కుంచెతో)
పిల్చారా అమ్మగారూ !

జ్యో : (బోర్డు చదివి నవ్వుతూ) "బివేరాఫ్ డాగ్స్" ! ఎందుకురా అది ?

జా : మన బంగాళా ముందు కడతానండి.

జ్యో : (నవ్వుతూ) బంగాళాలో వున్నవాళ్ళకోసమా ? బంగాళాకొచ్చే వాళ్ళకోసమా ?

జా : అందరికోసమూ నండి.

[ కారు ఆగిన ధ్వని, తలుపు మూసుకున్న చప్పుడు ]

జా : అదిగో అయ్యగారొచ్చినట్టున్నారు... (చేతిలోని బోర్డు డ్రాయరుమీద పెట్టి తొందర తొందరగా అవతలకి వెళ్తాడు. ఒకక్షణంలో ముందు డాక్టరు, వెనుక జాన్ ప్రవేశం. డాక్టరు విలువైన సూటు వేసుకొని వుంటాడు. మోములో ఆకర్షణ, పెదవులపై చిరునవ్వు, వయస్సు 35 సం॥ లు. చేతిలో స్టెతస్కోపు. ఇంకొక చేతిలో పూలగుత్తి. జాన్ మెడిసన్ చెస్టు పట్టుకొన్నాడు.)

డాక్టర్ : (జాన్‌తో) మిస్టర్ స్టువర్టు బంగాళాకు వెళ్ళడం మర్చిపోయాను. రేపు రౌండ్సుకి వెళ్ళినప్పుడు జ్ఞాపకం చెయ్యరా. తీసుకొని వస్తాను.

జ్యో : ఇవాళే తెస్తారని, పాపం ! బోర్డుకూడా రాసేడు.

[జాన్ బోర్డు తీస్తాడు.]

డా : (బోర్డు చూసి) వెల్ డన్! అలావుండాలిరా తెలివి తేటలంటే! ఒకపని చెబితే పది పనులు చక్కబెట్టుకు రావాలి.

[జాన్ లోపలికి వెళతాడు.]

[డాక్టరు నవ్వుతూ పూలగుత్తి జ్యోతి కందిస్తాడు. జ్యోతి అందుకొని వాసన చూస్తుంది]

జ్యో : ఎంత బాగుంది! ఎవరు కష్టేరోగాని! మీటింగునుం చొస్తున్నారా?

డా : అహఁ...నీకు గులాబీలంటే యిష్టంకదా అని బజార్లో కారాపి దిగాను. ఎవరో మంత్రిగారొస్తున్నారట. పువ్వులన్నీ చెల్లిపోయాయి. పూలవాడు "యీ బొకే తీసికెళ్ళండయ్యగారూ" అన్నాడు. డబ్బులిస్తే పుచ్చుకోడు.

జ్యో : ఇంతసేపూ మీరు రాకపోతే మీటింగుకు వెళ్లేరేమో ననుకున్నాను.

డా : వెళ్ళడానికి తీరికేది? బోలెడన్ని పనులు. ఒకటా! రెండా! ఏదైనా పబ్లిక్ వర్కు చేదామంటే దేశంలో కోపరేషన్ తక్కువ (కుర్చీలో కూర్చుని) తీరా మనం ఒకటి ప్లానుచేసి బిల్డుచేస్తే తామే యిదంతా సాధించినట్లు అందులో వేలుపెడతారు. పదిమంది పేదవాళ్ళకు నర్సింగు హోమ్ కడదామని ఒక్కటొక్కటే అన్నీ నేను రడీచేసుకొంటుంటే అంబుజమ్మగారి భర్త, ఆ నర్సింగ్ హోమ్‌కి తన తండ్రిపేరు పెట్టాలంటాడు. పెడితే తాను పూరు చివరనున్న వేస్టులాండు, డొనేట్ చేస్తాట్ట.

జ్యో : హాస్పటలుకు, పబ్లిక్ అంతా డొనేట్ చేస్తే ఒకవ్యక్తి పేరు మీరెలా పెడతారు ?

డా : అదే నేనూ అంటున్నది. ఆయన సైటు డొనేటు చేయకపోతే పబ్లిక్ వర్కు ఆగిపోతుందా ? 'తెగించి దానం చేస్తాను. తేరా పిడికెడురాళ్లు' అన్నాట్ట వెనకటి కెవడో యిలాంటివాడే...అన్నట్టు ఆ ! హెడ్ మిస్ట్రెస్ కనకవల్లి లేదూ, మన యింటికివస్తూ దారిలో కనిపించింది. రేపు వాళ్లస్కూలు యానివర్సరీ అట. మనం యిద్దరం వస్తేనేగాని వీలు లేదంటోంది. తీరిక లేదన్నాను. కాదు. కూడదంది. నేను ప్రిసైడ్ చెయ్యాలిట. నువ్వు బహుమతులు పంచిపెట్టాలిట...పోనీ వెడదాం జ్యోతీ !

జ్యో : ఎందుకులెద్దురూ, ఊళ్లో గొడవలూ.

డా. మరి మరీ చెప్పింది. సరే వస్తాం అన్నాను. పబ్లిక్ ఫంక్షన్ కాదంటే ఎలాగ ? చదువుకున్న దానివి; నలుగురితోనూ తిరగాలి. సోషల్‌గావుండాలి. పదిమందిలోను మనం పాప్యులర్ గా వుండాలి.

జ్యో : (తలవంచుకొని) నలుగురిలోనూ మొహం ఎత్తుకొని నేనెలా తిరుగుతాను !

డా : నీకేం? అందాల బరిణవి! చిదిమి దీపం పెట్టుకోవచ్చును! ఏం తక్కువని నీకు నలుగురిలోను చిన్నతనం ? మోస్టు ఇన్‌ఫ్లుయెన్షల్, ప్రోమిసింగ్ అండ్ యంగ్ డాక్టర్ శ్రీరామ్ సతీమణివి.

జ్యో : ఇంతవరకూ అంతా అలాగే అనుకుంటున్నారు. కాని...కాదని తెలిస్తే... ?

డా: మనం కాకపోతేకదూ? అందరితోను నువ్వు నా మిసెస్ వేనని చెబుతున్నాను!

జ్యో: మీరు చెబుతున్నంత మాత్రాన నా అంతరాత్మ అంగీకరించవద్దూ?

డా: ఓస్! అదా, నీ సందేహం! హాస్పటల్‌లో నా ప్రాణాలు రక్షించిన దానివి; నిన్ను నేను మోసం చేస్తా ననుకొన్నావా?

జ్యో: నాకు మీరన్యాయం చేస్తారని కాదు.

డా: మరి? ఇన్నాళ్ళు లేని అనుమానం నామీద నీ కెందు కొచ్చింది? దేశం కోసం నా ఆస్తినీ, రక్తాన్నీ ధారపోసిన నేను......

జ్యో: ఇంకోలా ప్రవర్తిస్తారని కాదు.

డా: నువ్వు మోస్టు ఇన్నొసెంట్... మన వివాహం ఎంత త్వరగా అయిపోతే అంత మంచిదని నీకంటె నాకే తొందరగా వుంది. ఆలస్యమైతే ఆనక మేనత్త కూతుళ్ళని, మేనమామ కూతుళ్ళని మెడకు చుట్టుకుంటారు. డర్టీ రిలేషన్స్... అందుకే కదా నా బర్త్ సర్టిఫికేట్ కోసం పుదుచ్చేరికి రాశాను. నేడో రేపో అదివస్తుంది. హాయిగా ఇద్దరం పెళ్ళి చేసుకుందాం!

జ్యో: మాటల్లోపడి మరచిపోయాను. అతనెవరో మీ కోసమే నచ్చేట్ట. మీ రెంతకీ రాకపోతే అయ్యగారితో చెప్పండని రెండు వేలూ యిక్కడుంచి పోయాడు...... జాన్! జాన్! ఆ నోట్లేవీ?

డా: (నవ్వుతూ) నువ్వో ఓ కేసు పట్టావా ఛాయా.?

జా : (నోట్లతో ప్రవేశిస్తూ) అమ్మగారు పట్టారా, దానంతటదే వచ్చింది కాని!

డా : అయితే మరీ మంచిది!

జ్యో : అతని తమ్ముడికి మీరు జబ్బు నయం చేస్తామన్నారట కదూ? వాళ్ళన్న రెండు వేలు పట్టుకొచ్చాడు. (కోపంతో) తమ్ముడు పిచ్చి కుదర్చవద్దని నేను మీతో చెప్పాలట.

జా : వాణ్ణి పిల్చి వాడి డబ్బు వాడి మొహాన్న కొట్టిరమ్మన్నా రమ్మగారు.

డా : ఇంకా నయం. అంతపనీ చేయలేదు.

జా : అందుకేనండి. అక్కడదాక వెళ్ళి వాడు లేడని చెప్పేశాను. అమ్మగారు మీలా కాదు...అంతా అమాయకం. (అంటూ వెళ్ళిపోతాడు)

డా : అంత అమాయకమైతే ఎలాగ ఛాయా? నాలుగు చేతులా డబ్బు సంపాదించాలి. డబ్బుంటే కొండమీది కోతి దిగొస్తుంది.

జ్యో : కొండమీదికోతి దిగొస్తుందని అన్యాయానికి వొడిగట్టుకుంటామా?

డా : ఇందులో మనంచేసే అన్యాయం ఏముంది? వాళ్లిద్దరూ అన్నదమ్ములు. తల్లి ఒక్కర్తే వుంది. లక్షాధికారులు. తమ్ముడు యిలాగేవుంటే ఆస్తంతా అన్నగారే అనుభవించవచ్చు. ఇంత పెద్ద కేసుకి రెండు వేలేనా తెచ్చేడు? ఎటొలీస్టు యిరవై వేలేనా రాబట్టా లనుకుంటున్నాను.

జ్యో : దానిమాటకేం...ముందీ డబ్బు అతనికి పంపించండి.

డా: చేతికొచ్చిన డబ్బు ఎవరొదులుకుంటారు ఛాయా?

జ్యో: డబ్బు పుచ్చుకొని రోగులకు అన్యాయం చేస్తారా డాక్టర్లు!

డా: ఇంకా న్యాయాన్యాయాలు విచారిస్తూ కూర్చుంటే గడుస్తాయా రోజులు? న్యాయం...ధర్మం...ఎందుకొచ్చిన వేదాంతం? పట్టుమని పాతికేళ్ళు లేవు నీకు. అవన్నీ అనుకుంటే ఎలాగ; ముందెంత జీవితముంది! ఇక నాలు గైదు నెలల్లో మనం యిద్దరం పారిస్ ప్రయాణం; అక్కడ నుంచి హాలీవుడ్; న్యూయార్కు! ఎన్ని నగరాలు చూడాలి! ఎన్ని దేశాలు పర్యటించాలి!...ఆఁ యీవినింగ్ క్లబ్స్; నైట్ క్లబ్స్, ఓపెరాస్, డ్యాన్సింగు పార్టీస్, నీకు తెలియవుగానీ మోస్టు ఎక్సలెంటు ఛాయా!

ఛా: అవన్నీ నేను కావాలన్నానా?

డా: కావాలంటే రావు; పొమ్మంటే పోవు.

ఛా: మరి మీ ఆదర్శాలు?

డా: డబ్బుంటేనే అన్ని ఆదర్శాలూను!

ఛా: ఏ ఆదర్శాన్నయితే మీరిపుడు విస్మరిస్తున్నారో, ఆ ఆదర్శాలకోసం ఒకనాడు ప్రాణాలు త్యజించడానికి సిద్ధపడ్డారు. గాయాలతో ఆసుపత్రికొచ్చారు. డాక్టర్లకి కూడా మీరు బ్రతుకుతారనే ఆశ లేకపోయింది. ఒక వీరునికి సేవ చేశాననే తృప్తి నాకు దక్కింది. అక్కడున్న నాలుగు నెలల్లోనూ ఎన్నోసార్లు "లోకంలో అధర్మం, అన్యాయం, మానవుల్ని మట్టిబొమ్మల్ని చేస్తున్నా"

యన్నారు; మనుష్యుల్ని మనుష్యులుగానే కాదు, దేవత లుగా మార్చాలన్నారు. ఈ సంఘం ఆడవాళ్ళను ఆట బొమ్మలుగా తయారుచేసే ఫ్యాక్టరీ; దాన్ని ధ్వంసం చేయాలన్నారు. జీవితాంతం నర్సుగా వుండదల్చుకున్న నన్ను మీరు ఆకర్షించారు. నా ఆదర్శాలే మీ ఆదర్శా లనుకొన్నాను. డబ్బుకోసం ఆత్మాభిమానాన్నీ, ఆదర్శా లనీ చంపుకుంటామా?

డా : అవును; ఆ ఆదర్శాలతోనే వియన్నా నుంచి చదువు పూర్తిచేసుకుని నేను మాతృభూమి మీద అడుగు పెట్టాను. నాతో చదువుకున్నవాళ్ళు పెద్దపెద్ద ఉద్యోగు లయ్యారు, ఆస్తులు గడించేరు. హాయిగా బ్రతుకు తున్నారు. ఫ్రెంచి ప్రభుత్వం నన్నూ కొలువులో చేర మంది. నేనేం కీలుబొమ్మను కానన్నాను. స్వేచ్ఛకోసం పోరాడుతున్న నా తోటి సోదరులను చూశాను. పుదుచ్చేరి విముక్తి కోసం నా ఆస్తినంతా ధారపోశాను. లాఠీ దెబ్బలు తిన్నాను. జైళ్ళలో నరకం అనుభవించాను. తుపాకులకు ఎదురొడ్డి నిలచేను. "నా" అనేవాళ్ళు లేకుండా నా కుటుంబం అంతా ఆహుతైపోయింది. మా యింటినీ, హాస్పిటల్‌నీ ధ్వంసం చేశారు. శరీరం నిండా గాయాలతో స్పృహ తప్పి పడివుంటే ఏ పుణ్యా త్ముడో నన్ను హాస్పిటల్‌కి చేర్చాడు. ఇంత త్యాగంచేస్తే చివరకి నాహృదయంలో గాయాలుమాత్రమే మిగిలాయి. కన్ను తెరిచేసరికి నువ్వు నాకంటికి దేవతవై కనిపించావు.

మళ్ళీ బ్రతుకుమీద ఆశపుట్టింది. ఇకనైనా జీవితాన్ని ఆనందమయం చేసుకుందాం ఛాయా!

ఛా: మన జీవితాన్ని ఆనందమయం చేసుకుందుకు ఇంకొకరి జీవితాన్ని దుఃఖమయం చేస్తామా?

డా: నాకు తెలియదూ? అలా ఎందుకు చేస్తాను ఛాయా? నేనేం డబ్బు తెమ్మన్నానా? తన స్వార్థంకోసం వాడే నాదగ్గర కొచ్చేడు. సరే పంపించేద్దాంలే. నీ మాట నేనెప్పుడైనా కాదన్నానా? కోపంవచ్చింది కదూ?

ఛా: ఊహుఁ........

[డాక్టరు పూలచెండు మళ్ళీ ఆమెకిస్తూ నవ్వుతాడు. ఛాయ పెదవులమీద చిరునవ్వు. కాలింగు బెల్లు వినిపిస్తుంది. ఇద్దరూ ద్వారం వైపు చూస్తారు. జాన్ లోపలినుండి వచ్చి తలుపుతీసి అవతల కెడతాడు. వెంటనే వస్తాడు.]

జా: మీ కోసం ఎవరో వచ్చారు.

డా: రమ్మను.

[జాన్ తలుపువద్దకు వెళ్తాడు. శ్రీనివాసరావు ప్రవేశం. ఆధునిక వేషధారణ. చురుకైన మనిషి. వయస్సు 35.]

శ్రీ. (వస్తూనే) గుడ్‌మార్నింగ్ సర్!

డా: యస్, ప్లీజ్! (కుర్చీ చూపెడతాడు) ఈవిడ మా మిసెస్ ఛాయాదేవి.

ఛా: నమస్తే!

శ్రీ: నమస్తే! నాపేరు శ్రీనివాసరావు; ఆంధ్రా కెమికల్ రీసెర్చి కంపెనీలో మేనేజరుగా వున్నాను.

డా: ఓ! అలాగా! చాలా పెద్ద కంపెనీయే. ప్రోస్పెక్ట్సు బాగున్నాయా?

శ్రీ: మంచి ప్రోస్పెక్ట్సే వున్నాయి గాని పాత డైరెక్టర్లు వాళ్ళలో వాళ్ళు పోట్లాడుకుని గుడ్‌విల్ చెడగొట్టారు. మార్వాడీస్ వచ్చి షేర్లు కొన్నారు. ఈ ఏడు వర్కు బాగా టర్న్ వుటయింది. మంచి ప్రోఫిట్సు!

డా: అంతేలెండి మనవాళ్ళు. అన్నీ వున్నాయి గాని ఆంధ్రాస్‌కి ఐకమత్యంలేదు. అంతా చేసి చివరకి ఎవరి చేతుల్లోనో పెడతారు, అనుభవించండిరా అని!

శ్రీ: సరిగ్గా అదే జరిగిందండి!

డా: (అర్థోక్తిగా) ఇంతకీ మీరొచ్చిన పనేమిటో?

శ్రీ: మాటల్లోపడి మరచిపోయాను. మా కజిన్ మతిచెడి బాధపడుతున్నాడు.

డా: మీ కజినా?

శ్రీ: అవును. మోహనరావని ఒకప్పుడు తనెంతో ఆనందంగా వుండేవాడు కాని యిప్పుడు మనస్సు వికలమై బాధపడుతున్నాడు.

డా: ఎన్నాళ్ళనుంచి?

శ్రీ: సుమారు రెండేళ్ళవుతుంది.

డా: రెండేళ్ళే? ఎవరికైనా చూపించారా?

శ్రీ: మెంటల్ హాస్పిటల్లో చేర్పించాం.

డా: ఊం. గుణం కన్పించిందా?

శ్రీ: అబ్బే! అక్కడికెడితే నాలాంటివాడికే పిచ్చెక్కింది.

డా: (చిరునవ్వుతో) ఇంతకీ యిప్పుడు పేషెంటెక్కడున్నాడు?

శ్రీ: వాళ్లూరునుంచి యివాళ వుదయమే తీసుకొచ్చాను. పేషెంటుని మీరెప్పుడు చూస్తామంటారా?

డా : దానికేముంది ? మీ రెప్పుడు చూపిస్తే, అప్పుడే.

శ్రీ : అయితే సాయంకాలం తీసుకొస్తానండి. ఫీజు గురించి మమ్మల్ని కాస్త......

డా : ఫీజుమాటకేంలెండి ! పేషంట్ యిదివర కేంచేస్తూండే వాడు ?

శ్రీ : కాలేజీలో లెక్చరర్‌గా వుండేవాడు. చాలా తెలివైన వాడు. యమ్. ఏ. ఫస్టుక్లాసులో ప్యాసయాడు.

డా : మంచి వుద్యోగమే. ఊఁ...

శ్రీ : నెలకో మూడు నాలుగు వందలు వచ్చేవండి. స్టూడెంట్సంతా అతన్నెంతో లైక్ చేసేవారు. ఊళ్లో చాలా పాప్యులర్‌గా వుండేవాడు. తోటి లెక్చరర్లలో కొంత మందికి అతనిమీద యీర్ష్య పుట్టింది.

డా : పాప్యులర్ ఫిగర్సుని చూస్తే ఎప్పుడూ అంతేలెండి !

శ్రీ : ఆ వూళ్లో ఏ ఫంక్షన్ జరిగినా అతన్ని ఆహ్వానించే వారు. ఎంతో పోయిటిక్‌గా మాట్లాడేవాడు. మంచి స్పీకరు. భార్య ఎంతో మంచిది. చదువుకున్న పిల్ల. ఇద్దరూ చీకూ చింతా లేకుండా చిలకా గోరువంకల్లా ఎంతో ప్రశాంతంగా రోజులు గడిపేవారు. కాని వున్నట్టుండి వాళ్ళ జీవితంలో అశాంతి రేగింది. ఎక్కడ చూసినా గుసగుసలే. ఏ గోడమీద చూసినా ఆవిడ పేర్లే. అంతటితో అతను ట్యూషన్లు మానుకున్నాడు. భార్యను అర్థం చేసుకోకుండా అనుమానించేడు. కిట్టనివాళ్ళు వాళ్ళ జీవితంలో చిచ్చుపెట్టేరు.

[ఛాయ మెల్లిగా మేడమీదికి వెడుతుంది]

డా: స్కాండల్ మాంగర్స్ !

శ్రీ: ఆ స్కాండల్స్ భరించలేక భార్యను విడిచిపెట్టాడు. పుట్టింటికి పంపివేశాడు. నలుగురిలోనూ తలెత్తుకు తిరగ లేక వుద్యోగం మానుకున్నాడు.

డా: సరే, సాయంకాలం తీసుకురండి. నా శాయశక్తులా ప్రయత్నం చేస్తాను.

శ్రీ: మీమీదెంతో ఆశపెట్టుకు వచ్చాను. మీరు ట్రీట్ చేస్తే మావాడికి తప్పకుండా నయమౌతుంది. మీ హస్త వాసి ఎంతో మంచిదని విన్నాను.

డా: అదే నయమవుతుందిలెండి. కాని చాలా కాస్ట్లీ మెడిసన్స్ వాడాలే. కేసు డిలే చేశారు కూడాను.

శ్రీ: అయితే అవనీయండి. ఎంత డబ్బైనా యిబ్బందిలేదు. కేసు బాగా ముదిరేక, డబ్బుకు జంకితే ఎలాగ ? ఖరీదైన మందులే వాడండి డాక్టరుగారూ !

డా: సాయంత్రం పేషెంటుని చూశాక మందులికి వ్రాద్దాం. రోగులికి డబ్బు ఖర్చుపెట్టుకొనే తాహతుండాలేగాని జబ్బులు కుదరకేంజేస్తాయి.

శ్రీ: అయితే ఏమాత్రం తీసుకురమ్మంటారు ?

డా: అందాక ఓ వెయ్యి పట్టుకోండి. ఎంతకాలంపడుతుందో ట్రీట్‌మెంట్ !

శ్రీ: సాయంకాలం తీసుకొస్తాను. థాంక్స్ ! సెలవు (నమస్క రిస్తూ వెళతాడు)

డా : (డ్రాయరులోంచి నోట్లుతీసి లెక్కపెడుతూ) జాన్ ! జాన్ !

[జాన్ మేడమీదికి వెడుతున్నవాడల్లా ఆగి డాక్టరు దగ్గరకొచ్చి నిలబడతాడు. డాక్టరు మాట్లాడకుండా నోట్లను లెక్కపెట్టుకుంటాడు.]

జా : (నోట్లవైపుచూసి) పొద్దున్నొచ్చినతనికి యిచ్చిరమ్మంటా రాండి ?

డా : (అనుకోకుండా) ఆఁ...ఎందుకులే ! (సర్దుకొని) అతనెవరో నీకేం తెలుస్తుంది. అమ్మగారేం చేస్తున్నార్రా ?

జా : మేడమీద గదిలో వున్నారండి.

డా : పాపం, అమాయకురాలు ! తెల్లనివన్నీ పాలను కొంటుంది.

జా : మీకు తెలీనుకానండి అమ్మగారికి జాలి హెచ్చండి. హాస్పిటల్ వున్నప్పుడు రోగుల కష్టాలుచూసి కళ్లనీళ్ళు పెట్టుకొనేవారు. ఆ జాలే లేకపోతే అమ్మగారికేం లోటండి ? అందరిలాగా ఆవిడదగ్గరా డబ్బుండును. ఈ కాలంలో మా అయ్య చెప్పినట్లు - డబ్బు లేకపోతే గొంతైకూడా కరుస్తుంది.

డా : మీ అయ్య చనిపోయా డన్నావుకదూ.

జా : మా అయ్యేవుంటే నే నా ఆసుపత్రిలో ఆర్డర్లీగా ఎందుకు చేరుతానండీ !

డా : మీ అయ్యేం చేసేవాడు ?

జా : లండనుకూడా వెళ్ళేడు !

డా : అలాగా ! ఎప్పుడూ చెప్పేవు కావేం ?

జా : మీరెరగరు కాని మా వూళ్ళో ఓ దివాణం వుండే దండి ! మారాజుగారి దగ్గర మా అయ్య కుక్ గా వుండే

వాడు. ఆయనికి మా అయ్య వంటం టే ఎంతో యిష్టం. మా అయ్య ఓ పూట పక్కి వెళ్లకపోతే ఆ పూట మారాజుగారు పళ్లుతిని పూసుకునేవారట. అందుకనే లండన్ వెడుతూ, కూడాతీసుకెళ్ళారు.

డా : నువ్వూ మాతో న్యూయార్కు వద్దువుగాని, యీ లోగా ఓ మంచిపిల్లనిచూసి పెళ్ళి చేసెయ్యమంటావురా జాన్ !

జా : అయ్యా, బాబోయ్ ! ఏదైనా చెయ్యండికాని పెళ్ళి మాత్రంవద్దు !

డా : పుదుచ్చేరిలో సరిగ్గా నీలాగే నా దగ్గర ఒకడుండే వాడురా. వెరీగుడ్ ఫెలో. కారు డ్రైవ్ చేస్తే వాడే చెయ్యాలి. నేను వియన్నా వెడుతున్నప్పుడు టాక్సీగా తోలుకొమ్మని నా కారు వాడికిచ్చేశానురా. నేను వియన్నా నుంచి తిరిగివచ్చేసరికి వాడో పెద్దఫ్లీటు ఓనర్ అయిపోయాడు. నాలుగు బస్సులూ, పదిటాక్సీలూ వాడి చేతికింద తిరుగుతున్నాయి.

జా : గొప్పవారు తలుచుకుంటే ఎంతసేపు ! తలుచుకున్నంత సేపు పట్టదండి, అదృష్టం పట్టడం. మా అయ్య చెప్పినట్టు ఒక రూపాయివరకు గడించడం మన వంతు. ఆనక అదే గడిస్తుందండీ బోలెడంత డబ్బు !........

(ఛాయ మేడ మెట్లుదిగుతూ వుంటుంది)

డా : వెధవ డబ్బు పోనిద్దూ ! అది మనల్ని గడిస్తుందా; దాన్ని మనం గడిస్తామా...(పొద్దున్నొచ్చినతన్ని గుర్తు పట్టగలవురా జాన్ !

జా : వాణ్ణి నేను చూడలేదండి.

డా : చూడకపోతే అడ్రసిస్తాను - ఓసారి వెళ్లిరా!

జా : పిల్చుకు రమ్మంటారా!

(ఛాయ మేడదిగి గదిలోకి వెడుతూ వుంటుంది)

డా : యీ డబ్బు వాడి మొహాన్న కొట్టిరా.

[ఛాయ గదిలోకి వెళ్ళిపోతుంది]

జా : ఎందుకండీ యింటికొచ్చిన డబ్బు పనిగట్టుకొని అంత దూరం నెళ్ళి వాడి మొహానకొట్టిరావడం!

డా : అంతేలే! అవసరంవుంటే వాడేవస్తాడు.

జా : మన అవసరం లేనివాడెనడండి యీవూళ్లో.

డా : ఈవూళ్లో యేముందిరా! ఎంతమంది పేషంట్లు వచ్చినా మిగిలేదేముంది? శనగలుతిని చెయ్యికడుక్కున్నట్టే. రోగులువస్తారు; మందులు తాగుతారు. బిల్లుయివ్వడానికి కాంపౌండర్లని యింటిచుట్టూ తిప్పుతారు. మళ్ళీ రోగం వస్తేనే డాక్టర్లకి వంకదండాలు పెడతారు. పూర్ కంట్రీ, రెచెడ్ పీపుల్! బొంబాయిలాంటి నగరంలో ప్రాక్టీసు పెడితే దాని బ్యూటివేరు. ఆ నగరాల తళుకులు వేరు. ఎవరూ కుదర్చలేని ఒక్క కేసును జాగ్రత్తగా డయాగ్నైజు చేసి, నయంచేశామా, మనపేరు మార్వాడీ సర్కిల్సులో మారుమ్రోగిపోతుంది. అక్కడనువ్వువళ్ళువంచి పనిచేయాలే గాని కూడు దొరకదని బెంగవుండదుకదూ!

జా : మా అయ్యకూడా సరిగ్గా అదేమాటనేవాడండి.

డా : మరి యిక్కడ జనం కూడుదొరకదో కూడుదొరకదో అంటారేమిట్రా! బ్రెయిన్లెస్ పీపుల్! మోస్టు లెథార్జిటిక్!

మనిషన్నవాడు ఎనర్జిటిక్‌గా వుండాలి. ఎంతో కృషి చెయ్యాలి. బాగా ఆర్జించాలి. తను తిన్నంత తినాలి, ఒకళ్ళకింత పెట్టాలి. చక్కగా బతకడానికి ట్రై చెయ్యాలి. నువ్వు వెయ్యి చెప్పు, లక్ష చెప్పు, ఆంధ్రాస్ మరి బాగుపడరు. మరి బెంగాల్, బీహార్, తమిళనాడులలో అలా కాదే; వాళ్ళలో వాళ్ళకు ఎన్ని తగువులుండనీ, అదనువస్తే అంతా ఏకమైపోతారు.

జా : అంతా ఒకమాటమీదుంటే పనులు టకీ, టకీ మని అయిపోతాయి కదండీ.

డా : కాదుట్రామరి ... బొంబాయిలో ఓ చిన్న సినిమా స్టారును చూచి పెళ్ళి చేస్తాను. పెళ్ళాడుతావుట్రా జాన్ ?

జా : అమ్మోరిబాబు (గంటస్తంభం చూస్తూ) లేటైపోతోంది. అప్పుడే గంటస్తంభం పన్నెండు వూదేసిందండి, హోటల్‌కు వెళ్ళాలి. (గబగబా లోనికివెళ్ళి క్షణంలో క్యారియర్‌తో ప్రవేశం)

డా : హోటలుకు నువ్వెడుతున్నావేం?

జా : (జాన్ వీధివైపు వెళ్ళబోతూ) కుర్రాడింకా రాలేదు, నేనే వెళ్ళొస్తాను.

డా : త్వరగా రా!

జా : (వెడుతూనే) ఎమ్‌డన్‌లా వచ్చేస్తా ... (వీధివైపు తిరిగి వున్నారన్నట్లు తలూపుతూ) లోపలున్నారు...భోజనం ఇంకా కాలేదు...ఏమీ అనుకోరు...మరేం ఫరవాలేదు...

డా : ఎవర్రా ?

జా : (చులకనగా) మేష్టరుగారండి !

[దత్తాత్రేయుడు వస్తాడు. వయసు 50 సం. లు. వస్తూనే డాక్టర్‌కి నమస్కరిస్తాడు. డాక్టర్ అందుకుంటాడు. జాన్ వెనక్కి ఒక్కసారి చూసి వెళ్ళబోతాడు].

డా : జాన్ ! మేష్టరుగారొచ్చారు కాఫీ పట్టుకురా.

జా : హీటర్ మీద చిటికలో చేసి పట్టుకొస్తా (అంటూ లోనికి వెళతాడు).

డా : ఏమిటి కథ మాష్టరుగారూ ! వేళ కాని వేళొచ్చారు !

దత్తా : ఇంక హైద్రాబాద్ ఎలాగూ వెళ్ళవలసి వస్తుంది కదా అని, విజిటింగు కార్డులు అచ్చువేయించాను. నా పేరు, నేనే చెప్పుకోవడం బాగుండదు చూడండి. అన్నీ యీ విజిటింగ్ కార్డే చెప్పేస్తుంది. (విజిటింగ్ కార్డు యిస్తూ) రెండు మూడు ముద్రారాక్షసాలున్నాయనుకోండి; పంక్చుయేషన్ మార్క్సు కరక్టుగా అచ్చుపడలేదు. మనిషికే వుంటాయి పొరపాట్లు, ప్రింటింగ్ ప్రెస్ అనగా ఎంత ?

డా : (చిరునవ్వుతో విజిటింగ్ కార్డు చదువుతూ) దత్తాత్రేయుడు, బి. ఏ. యల్టీ. ఎవరైనా మిమ్మల్ని చూడగానే అనుకుంటారండి హైస్కూలు మేష్టర్లని.

ద : మరోలా అనుకోరుగదా ! థాంక్యూ ... మనంమనం మామూలు అన్నదమ్ముల్లా మాట్లాడుకోవచ్చునా డాక్టరుగారూ !

డా : నిరభ్యంతరంగా.

ద : అసలు నేనేదీ దాచుకోలేనండి. మనస్సులో వున్నది బడా బడా పైకి అనేస్తాను. గుట్టూమట్టూ లేదు. అదే నా కొంప తీసింది...ఇక్కడింకెవరు లేనట్లేకదూ ?

డా : గోడలే వున్నాయి !

ద : మా హైస్కూలు గోడలచుట్టూ మా ఛైర్మన్ చెవులే నండి. గుసగుసమని ఏమనుకున్నా లౌడ్‌స్పీకర్‌లా అతనికి వినిపిస్తుంది.

డా : ఆ చెవులు మనం నులిపెడదాం, వచ్చే ఎలక్షనులో.

ద : మళ్ళీ ఎలక్షనులొకటొస్తాయా ? ఎలాగా సూపర్‌సీడయి పోతుంది. నేనే వింటాను నేడో రేపో ఆ ప్లెజంటు న్యూస్ బిట్ !

డా : అదేమిటది ? యీ డెమొక్రటిక్ రోజుల్లో !

ద : డెమొక్రసీ అని పెద్ద పేరుపారేస్తారేమిటి తమరు యీ వూరి మ్యునిసిపాలిటీకి ! డెమొనోక్రసీ అనండి మోస్టు ఎప్రొప్రియేట్ ! టెండర్ల దగ్గర పేచీలు, కంకరరోడ్ల కోసం కొట్లాట, వాళ్ళ యిష్టమైతే రోడ్లు, జాగాలు ఎంక్రోచి చేసి ఎన్ని మేడలు కట్టుకున్నా తప్పులేదండి. మన యింటికి గోడ కట్టుకోవాలంటే ఆఫీసుచుట్టూ తిరగాలి. కొందరు కౌన్సిలర్నూ, వూళ్లో తగుమనుష్యులు పన్నులు ఎగవేస్తే అడిగేవాడు లేడు. మనం పన్నుకట్టడం కాస్త ఆలస్యమైతే తలుపులూ, ద్వారబంధాలూ పీకి పట్టుకుపోతారు. పన్నులెగేసినవాళ్ళు దర్జాగా క్లబ్బుల లోను, కార్లలోనూ తిరుగుతూనే వుంటారు. పన్నుల ఎంక్వయిరీ రిపోర్టులో మాత్రం ఒకడు "డైడ్" అనీ యింకొకడు తన "వేర్ ఎబౌట్స్ అన్నోన్" అనీ రాయించుకుంటారు. పశువులుమేసే గడ్డికోసం కొందరు

కౌన్సిలర్లు నేను తింటానంటే నేను తింటానని ఒకళ్ళ మీద ఒకళ్ళు కలియబడ్డారు సార్ మొన్న!

డా: నందికేశ్వరులన్నమాట! (జాన్ కాఫీ పట్టుకువచ్చి టేబుల్ పైపెట్టి నిలుచుంటాడు) కాఫీ తీసుకోండి దత్తాత్రేయుడు గారూ!

ద: క్షమించండి... క్షమించండి...

డా: కాఫీ మా జాన్ తయారుచేశాడనా సంశయిస్తున్నారు!

ద: అబ్బెబ్బే! నా కలాంటి వర్ణ భేదం లేదండోయ్ మీ దయవల్ల! కాస్టుసిస్టమ్ కూడదని మొన్ననే క్లాసులో కుర్రాళ్ళచేత కాంపోజిషన్ రాయించేను.

డా: అయితేమరి సందేహమెందుకు? (కాఫీ యివ్వబోతాడు)

ద: మన్నించాలి పెద్దలు. ఇవ్వాళ మా అమ్మగారి ఆబ్దీకం.

డా: ఐసీ!

ద: ఇవాళ సెలవివ్వమంటే ఎంతకీ యివ్వలేదండీ మా హెడ్ మాష్టరు. "శనివారం శెలవు" రేపు పెట్టుకోకూడదా అంటాడు, తద్దినం.

డా: అరె వీడి దుంపతెగా! గట్టిచిక్కుల్లో పెడుతున్నాడే మిమ్మల్ని.

ద: ఇంక భయంలేదు. నెల్లాళ్ళలో రిటైర్ అయిపోతున్నాడు. అయినా రిటైర్ కాకుండా యింకా వుండాలనే వుంది గుళ్లో దేవుడిలాగ! అతను రిటైరయితే న్యాయంగా నెక్స్టుఛాన్స్ నాదే!

డా: ఇంతసేపూ ఆమాట చెప్పేరు కాదేం?... సంతోషం... సంతోషం.

ద. కానీ నాకాఛాన్సు రాకుండా శతవిధాల ప్రయత్నిస్తున్నారు సార్. సీనియరుని నన్ను కిందకు దిగగొట్టి నా జూనియరుని మీదికి లాగాలని ఎన్నిట్రయల్స్! ఈవూరు నుంచి హైదరాబాదుకి, హైదరాబాదునుంచి యీవూరుకి నా జూనియరు సీజను టిక్కెట్టు కొనుక్కుని మరీ తిరుగుతున్నాడు. ఆఫీసుల్లో అంతా ఏకమై నా సర్వీసు రికార్డులు మటుమాయం చేశారు.

డా: అరె! దారుణం!

ద: ఎంత అన్యాయమో చూడండి. నాకు రావలసిన పోస్టు. అందర్లోకి సీనియర్ని. ప్రిపేరు కాకుండా ఒక్క పిరియడు కూడా క్లాసుకు వెళ్లలేదు. నోట్సుమీద ఎన్నడూ, డిపెండు కాలేదు. నాదగ్గర చదువుకున్నవాడు పబ్లిక్ ఎగ్జామినేషన్లో ఒక్కడూ ఫెయిల్ కాలేదు. లెక్కలు తీయించమనండి.

డా: అవన్నీ బేరీజు వేయడానికి నేను డాక్టర్ని, మీ కమీషనర్ని; ఛెయిర్ మెన్ని కాదుగా!

ద: మీకుకూడా అలా అంటే ఎలా? పిల్లలవాణ్ణి. ఇంకేన్నాళ్ళు? నా సర్వీసు ఓన్లీ ఫయివ్ యియర్స్. నా రికార్డులన్నీ ఫైల్స్‌లోంచి తీసేశారు. అది చాలక చిల్లంగి పెట్టించాలని జపాలు చేయించారు. ఆ భూతవైద్యుడుండబట్టి బ్రతికిపోయాను.

డా: దయ్యాలూ, భూతాలూ అన్నీ ఓల్డు బిలీఫ్స్! ఉద్రేకపడక శాంతించండి.

ద: నా జూనియర్, ఆఫీసర్ల కుర్చీలకి తక్షకుడిలా చుట్టుకున్నాడు. తమరు నాచేత సర్పయాగం చేయించాలి.

డా: ముందు మీ కేసు నన్ను స్టడీచేయనీండి. దయ్యాలు, భూతాలు అంటే మీ కెందుకు భయం పట్టుకుందో, మీరు మాట్లాడుతున్నప్పుడు ఓ సబ్జక్టులోంచి మరో సబ్జక్టులోకి ఎందుకు డైవర్టు అవుతున్నారో......

ద: క్లాసులో నే నెప్పుడూ డైవర్టుకానండి. అవన్నీ మా జూనియరే! లెక్కలు చెబుతూ గాడిదకొడుకు, శ్రీనాథుడి సీసపద్యాలు చదువుతాడు. ఇది వరకు నేను యింతసేపు మాట్లాడేవాణ్ణి కాదు. చాలా క్లుప్తంగా మాట్లాడేవాణ్ణి క్వొశ్చనూ ఆన్సరు లాగ!

డా: అయితే ఎన్నాళ్ళనుంచి మీకీ, చికాకు?...

ద: నేను రాసుకున్న దరఖాస్తులు వీడు పంపడు. వీడు పంపితే వాడు పుటప్ చెయ్యడు. చేస్తే అతను చదవడు. మీ పిండాకుడు పిల్లులకు పెట్టా! ఏమిట్రా యిదంటే అయిదు తే పది తే తే తే తే! కాబూలీ వాళ్ళు నయమండి యింతకన్న!

డా: అలాంటప్పుడు మీ కేకాదు ఎవరికైనా మతిపోయినట్టుంది.

ద: పోయినట్టుండడమేమిటి ఖర్మ! నా రికార్డులతోపాటు ఆ వున్న కాస్తమతీ పోతే!

డా: సరిగ్గా సమయానికి మేలుకున్నారు. మరో నాలుగు పూటలు అశ్రద్ధచేస్తే మీ కేసు నాకున్నా సాధ్యపడక పోను.

ద: అందుకే కదండీ, మీ సంగతి జ్ఞాపకంరాగానే పరుగెత్తు కొచ్చాను. మీ పేరూ, మీ ప్రఖ్యాతీ, మీ మంచితనం అన్నీ ఒక్కసారి స్మరించుకొని 'అమ్మయ్య ఇక నాకేం భయంలే"దనుకున్నాను. విశ్వామిత్ర మహర్షి, శునశ్శేపుణ్ణి రక్షించినట్టు మీరు నన్నాదుకోవాలి. తమకు హైదరాబాదులో చాలా ఇన్‌ఫ్లుయన్సు వుందట. డైరక్టరుగారికి ఓ చిన్న సిఫారసు ఉత్తరం యిస్తే యీ సాయంకాలమే వెళ్ళిపోతాను. బ్యాంకు లోను యిన్నాళ్ళకి శాంక్షను అయింది. ఇప్పుడే అందుకుని గంపెడాశతో యిలా వచ్చేశాను. ఈ వున్నడబ్బు ఖర్చయిపోతే మళ్ళీ ట్రయ్ చెయ్యడం కష్టం.

డా: ఎంత పెద్ద ఆఫీసరయినా మీ సర్వీసు రికార్డులు పోయినప్పుడు ఆయనమాత్రం ఏంచేస్తాడు?

ద: అయితే నా జూనియర్ రికార్డులు నేనూ తీయించేస్తాను. ఎంత డబ్బయినాసరే డొక్క బద్దలుచేస్తాను. నాతో నాటకం ఆడుతున్నాడు! నాటకం!

డా: అప్పుడు మీకూ రాదు; మీ జూనియరికీరాదు; ఆ హెడ్మాస్టరు గిరీ, మ్యున్సిపాల్టీవాళ్ళు మూడోవాడికిస్తారు.

ద: అహా! అలాగా? నాకివ్వకుండా, నా జూనియర్ కిస్తారా, మ్యునిసిపాలిటీవాళ్లు? మంగల్ని చూసి ఎద్దు కాలు కుంటిందట! చూస్తాను; ఎలాయిస్తారో నేనూ చూస్తాను! మ్యునిసిపాలిటీని సూపర్ సీడ్ చేయించేస్తాను. డి. ఇ. ఒ. ఆఫీసు ఎత్తించేస్తాను. నాతో తమాషాలాడుతున్నాడు, తమాషాలు. నా జూనియర్, వాడికే అంతోటి పలుకు

బడుంటే; వాడి సీనియర్నీ నాకెంత పలుకుబడి వుంటుంది! చూపిస్తాను. దాని మజా ఏమిటో చూపిస్తాను. నాకు ఇన్‌ఫ్లుయన్స్ లేదనుకుంటున్నాడు. అక్కుపక్షి! అందరికాళ్లూ పట్టుకుని ఆఫీసులచుట్టూ తిరిగి ఆఫీసర్ల యిళ్ళకు కూరలూ, నారలూ, నూనెడబ్బాలూ, నేతిడబ్బాలూ, బెల్లపచ్చులూ, బియ్యంబస్తాలూ, చీరలూ, చాపులూ, జున్నులూ, అవీ మోసుకెడుతూ మేవాలుమేపి తనకే పెద్ద ఇన్‌ఫ్లుయన్స్ వుందనుకుంటున్నాడేం?...పిచ్చిముండాకొడుకు!

డా: వాడి పిచ్చిగొడవ మనకెందుకు? ముందు మీ గొడవేదో మీరుచూసుకోండి దత్తాత్రేయుడుగారూ!

ద: అయితే ఓమాట, డాక్టరుగారూ! (జాన్‌ను చూసి) మనం మనం అన్నదమ్ముల్లా మాట్లాడుకుంటూంటే, వీడెందుకండీ యిక్కడ సిసింద్రీలాగ!

డా: మీరేం భయపడకండి. వాడు మీ శిష్యుల్లాంటివాడు. జాన్! హోటలుకి వెళ్ళలేదుటరా!

జా: ఈయన కబుర్లు వింటుంటే, ఆకలిమాటే మర్చిపోయానండి (అంటూ వెళ్ళిపోతాడు)

ద: చూశారా, చూశారా! నాక్లాసులో ప్రతీకుర్రాడూ అదేమాట అంటాడండీ!... తమకో చిన్న రహస్యం చెబదామని వుంది. చెబితే ఎవరితోనూ అనరుకదా?

డా: మంచివారే! అలా అయితే, మేమేండాక్టర్లం! మీరేం పేషెంట్లు! ఏ పేషెంటు రహస్యం ఆ పేషెంటు దగ్గరే ఈ చెవినివిని ఆ చెవిని వదిలేస్తాం, డాక్టర్లం!

ద: నేనేం పేషెంటునుకాను డాక్టరుగారూ?

డా : అవునో కాదో చెప్పేది నేనండీ మాస్టరుగారూ!

ద : పోనీ అలాగే అనుకోండి...డాక్టర్లకి పేషెంట్లంటే జాలి, మాస్టర్లకి స్టూడెంట్లంటే జాలిలాగ! నన్ను మీరు కడుపులో పెట్టుకుని కాపాడాలి. అన్నదమ్ముల్లాంటి వాళ్ళం. రామాయణంలో ఓ కథవుంది. మీరు వినేవుంటారు. కాకాసురిడిమీద రాములువారు, ఓ గడ్డిపరక త్రుంచి మంత్రించి వొదిలినట్టు నా జూనియర్ మీద మీరూ ఓ అస్త్రం ప్రయోగించాలి. తమ పేరుకూడా శ్రీరామే! ఏ ప్రయోగమో చేసి మనం గప్‌చిప్‌గా పిచ్చెక్కించామూ వాడసలు వుద్యోగానికే పనికిరాడు, నా వుద్యోగం నాకే వస్తుంది!

డా : (అదిరిపడి) వాట్ మిస్టర్ దత్తాత్రేయ! నేను నీ జూనియరికి పిచ్చెక్కించాలా?

ద : మ...మరి వాడు మనకి జపాలుచేయించి చేతబడి చేయించేడు కదండీ. దెయ్యాల్ని పట్టించేడు కదండీ. ఆ భూతవైద్యుడుండబట్టి బ్రతికి పోయాను. 'వైద్యో నారాయణో హరిః' అని!

డా : నేనేం మంత్రగాణ్ణనుకున్నావా? భూతవైద్యుణ్ణనుకుంటున్నావా! వాడికి నన్ను పోయిజన్ యిమ్మన్నావని నేను డియస్‌పీకి ఫోనుచేస్తే, యిప్పుడు నువ్వెవహాతావో తెలుసా? పోలీసుస్టేషన్లో వుంటావు.

ద : అమ్మమ్మమ్మ! అంతపని చేయకండి. పోలీసువాళ్ళ చేతుల్లోపడితే పులిబోనులో పడ్డట్టే. ఎక్కడి కక్కడ పీకుకుని తినేస్తారు. నిష్కారణం చెడిపోతాను.

డా : అందుకే వ్రాసుకున్నాను, పాపం పిల్లలవాడివని.

ద : అందులోనూ ఆడపిల్లల వాణ్ణి సార్. మీకున్న దయ ఆ అధికార్లకుంటే నాకీ తిప్పలే వుండకపోను.

డా : సుపీరియర్స్‌కి సబార్డి నేట్సు మీద ఎందుకుంటుందయ్యా! ఇంతకీ నీకు కావల్సింది హెడ్‌మాష్టరిగిరీ, అంతేకదూ?

ద : అంతేనండి. తమరో రికమెండేషను లెటరిస్తే హైద్రాబాద్‌లో బిచాణా వేస్తాను.

డా : వుత్తరాల కేముందీ! లక్షమందికి లక్ష వుత్తరాలు రాసిస్తాను. డబ్బులున్నాయికదాని హైద్రాబాద్‌లో బిచాణా వేసినంత మాత్రాన పనులౌతాయా? అందులోనూ మీ రికార్డులే గల్లంతై పోయాయి.

ద : అవునండి. ఆ ఆఫీసులూ, ఆ ఆఫీసర్లూ అంతా నాకు కొత్తే! ఆ ఆఫీసులు చుట్టూ తిరగడం నాకు మొదట్నుంచీ అలవాటు లేదు. పోనీ నన్ను కటాక్షించి తమరొక్కసారి వెడితే కార్యం యిట్టే అయిపోతుంది.

డా : అక్కడికి వెడితే యిక్కడ నా ప్రాక్టీసు?

ద : ఇబ్బందే అనుకోండి. అయినా ఎంతసేపు? ఇవాళ జనతాలో వెడతారు. రేపు జనతాలో చక్కావస్తారు. నేను వెళ్ళకుండా మీరు వెడితే ఓ కిటుకుంది సార్. వూళ్లో నేను కనిపించకపోయేసరికి నే నేవేవో ట్రయల్సు చేస్తున్నట్లు, యీ రహస్యం కాస్తా బయటపడిపోతుంది. శత్రువులు మరీ విజృంభిస్తారు.

డా : శత్రుశేషం, ఋణశేషం వుండకూడదు. సరే, మీ కార్యం చక్కబెడతాను.

ద: శ్రీరామచంద్రుడిలా మీ రామాస్త్రం అభయహస్తం యిస్తే సుగ్రీవుళ్ళా నేను తెరిపిన పడతాను. మీ బాణానికి శత్రుమూక చెల్లాచెదురైపోవాలి. మ్యునిసిపాల్టి సూపర్ సీడ్ అయిపోవాలి. నా రికార్డులు కాల్పించేస్తాడా...... కాకాసురుడిలా మూడులోకాలూ తిప్పేస్తాను. పాపం! నాకు ఇన్‌ఫ్లుయన్సు లేదనుకుంటున్నాడు! ఎంతడబ్బైనా సరే, నా తడాఖా చూపిస్తాను. ఇదిగో వెయ్యి! (బల్లపైపెట్టి) ఇప్పుడే తమరు బయలుదేరాలి. ఆలస్యం అమృతం విషం!

డా: నా కెందుకయ్యా డబ్బు?

ద: తమరలా అనకండి. రైలుఖర్చులైతే తమరు పెట్టుకుంటారుగాని ఆఫీసు ఖర్చులుకూడా మీ నెత్తిన నేను పులమడం ఎటికేట్ కాదు. అదీకాక యింటి కెళితే యీడబ్బుకాస్తా నిష్కారణంగా పులుసులోపడిపోతుంది. ఆనక మన ట్రయిల్సుకి యిబ్బంది.

డా: సరే. యిక మీరు యింటికివెళ్ళి ధైర్యంగా గుండెల మీద చెయ్యి వేసి పడుకోండి.

ద: మీ రామాటంటే హాయిగా నిద్ర పడుతుంది! సెలవు! తమర్ని జనతాకి దిగబెట్టమంటారా?

డా: నేను వెడతానో వాడికి పిచ్చెక్కిస్తానో అవన్నీ మీకెందుకు? మీ వుద్యోగం మీ కొచ్చిందనుకొని నిశ్చింతగా వుండండి.

ద: తమరా మాటంటే వుద్యోగం చేస్తున్నట్టే కాలుమీద కాలు వేసుకొని కూచుంటాను. సెలవు! (కొంచెం దూరం

వెడతాడు. మళ్లీవచ్చి విజిటింగ్ కార్డు తీసి లోపల చదువుకుంటూ)
మళ్లీ తమర్నెపుడు కలియమంటారు ?

డా : వుద్యోగం వచ్చాక!

ద : మీ రామాటంటే చాలు, నా ఇన్‌ఫ్లుయన్స్ ఏమిటో ఇంజక్షన్లా (అవతలకిపోతూ) చూపిస్తాను.

డా : (నోట్లుతీసుకొని జేబులో పెట్టుకుని యీలతో పాడుతూ హుషారుగా పంజరం చెంతకు వస్తాడు. చిలకను కదిలిస్తాడు) రామా అను ! ఏదీ ఒక్కసారి ! రామా అను! అత్తగారొచ్చారు పీటవెయ్యాను. పెళ్ళి వారొచ్చారు విడిదిమ్మను ! మోస్టు లవ్ లీబర్డ్ !...ఛాయా ! ఛాయా ! (అంటూ ఒక గదిలోంచి అవతలకి వెడతాడు. ఛాయ మరో ద్వారంలోంచి లోపలికి వస్తుంది. డ్రాయరు మీద బుద్ధుని ప్రతిమ యథాలాపంగా తీసి మళ్ళీ పెట్టేస్తుంది.)

డా : (నవ్వుతూవచ్చి) ఇంతసేపూ ఎక్కడున్నావు ఛాయా ! నీకోసం వెయ్యికళ్ళతో వెతుకుతున్నాను.

ఛా : అవతల ఫౌంటెన్ దగ్గర నించున్నాను.

డా : ఫౌంటెన్‌లో రంగు చేపల్ని చూస్తూ కూర్చున్నావా ! నువ్వు నా చెంత లేకపోతే నే నొక్కక్షణం వుండలేను ఛాయా ! ఇందాక ఎందుకంత హఠాత్తుగా వెళ్ళిపోయావు ? సగంసగం మాటల్లో అలా వెళ్లిపోతే యింటికొచ్చినతను ఏమనుకొంటాడు? చదువుకున్న యువతి, డాక్టరుగారి భార్య, ఆధునిక మహిళ, ఆ మాత్రం ఎటికెసీ తెలియదని ఆయ ననుకోడూ ?

ఛా : అతను చెప్పేకథ వినగానే శరీరం జలదరించింది. కళ్ళు చెమ్మగిల్లేయి. మరి వినలేకపోయాను.

డా: పేషెంట్లను చూసి కళ్ళనీళ్లు పెట్టుకునే పిల్లవు, జీవితాంతం నర్సుగా ఎలా వుందామనుకున్నావు ఛాయా?

ఛా: కాని అక్కడకు వచ్చే రోగులు వేరు. ఇక్కడకువచ్చే రోగులు వేరు. శరీరానికి వచ్చే రుగ్మతకంటె హృదయానికి తగిలేగాయం హెచ్చుకదూ?

డా: లోకంలో అనేకమంది బికారులు వుంటారు. తల్లీ, తండ్రీ కూడాగుడ్డా, కొంపాగోడీ లేనివాళ్ళు! రోజూ మనకళ్లముందు ఎంతమంది తిరగడంలేదు? వాళ్ళ జీవితాలను తలుచుకుంటూ, మనం దుఃఖపడుతూ కూచుంటే ఈ బుద్ధుడిలా అందరూ సన్యసించాలి. ఇంతకూ ఆ పేషెంటుని చూసి ఒకళ్లు జాలిపడవలసిన అవసరం ఏముంది? అతను భార్యను అనుమానించేడు. అవతలకు వెళ్లగొట్టాడు.

ఛా: (సన్నని గొంతుకతో) ఎవరేనా అకారణంగా నిక్షేపం లాంటి భార్యను వెళ్ళగొడతారా?

డా: అలాంటి పిరికివాళ్ళు ఎంతమందిలేరు? అతను పిండి బొమ్మవంటి సమాజాన్ని చూసి పిశాచమనుకుని భయపడ్డాడు. చివరికి ఆ సమాజమే అతన్ని పిండిబొమ్మనుచేసి అవతలకు నెట్టింది. సంఘం అంటే ఏమిటి? భయపడే వాళ్లను మరీ భయపెట్టే బూచి.

ఛా: అంత భయపడేవాడు ఆమెకు స్వేచ్ఛ ఎందుకిచ్చాడు? క్లబ్బులకు వెళ్ళమన్నాడు. తనతో సభలకు రమ్మన్నాడు.

డా: క్లబ్‌లకు, సభలకు, సమావేశాలకు వెళ్లినంతమాత్రం చేత భార్యను, భర్త అనుమానించమని ఎక్కడుంది?

అతను పిరికివాడు ! సంఘం ఆమెను స్కాండలైజ్ చేసింది ! అతను భయపడి వదలిపెట్టాడు !

ఛా : ఏమీ లేనిదే స్కాండలైజ్ చేస్తూ కూచుందుకు సమాజానికి దేపనా ?

డా : అయితే ఆమెదే తప్పంటావా ?

ఛా : ఏమో ; ఆమె ఎలాంటిదో ఎవరికి తెలుసు ?

డా : ఎవరికి తెలిసినా ఎవరికి తెలియకపోయినా సమాజానికి మాత్రం తెలిసిపోతుందిలే ! సమాజం ఎప్పుడూ యింతే! ఆనాడు ఏదో ఒకమూల ఏదో ఒక పేటలో సమాజం స్కాండల్స్ వేస్తే శ్రీరాముడు, తన భార్యను అనుమానించి విడిచిపెట్టలేదూ? సీత ఏం మోసంచేసిందని ? రాముడు దేవుడు ! గుడుల్లో వుండిపోయాడు. వీడు మానవమాత్రుడు. డాక్టర్లదగ్గరకొచ్చాడు !

ఛా : ఈ పేషంట్లూ వీళ్ల బాధలూ నేను చూడలేను. వినలేను. ఈ గొడవలు వినిపించకుండా ఎవ్వరూ కనిపించకుండా దూరంగా ఎక్కడో ప్రశాంతంగా వుండాలని వుంది!

డా : హుఁ ! వెర్రిపిల్లా ! నిన్నెవరుండొద్దన్నారు ? ఒకరి బాధలూ, గాధలూ నిన్నెవరు చూడమన్నారు ? ఎవరు వినమన్నారు ?

ఛా : ఇక్కడికొచ్చే వాళ్ళంతా...

డా : రోగులూ ! నేను డాక్టర్ని; నాకోసం వస్తారు. వాళ్ళ జోలి నీకెందుకు ? అవతలతోటలో ఫౌంటెన్‌లో రంగు చేపల్ని చూస్తూ హాయిగా ప్రశాంతంగా కాలం గడపక ! నీ కేంలోటు ? నేను రెండు చేతులా గడిస్తున్నాను; నిను

నాలుగు చేతులా ఖర్చు పెట్టమంటున్నాను. నీలాంటి పిల్లని నేనెక్కడా చూడలేదు ఛాయా! చీరలన్నా, నెక్ లస్‌లన్నా, రవ్వల ఆభరణాలన్నా ఆడపిల్లలు నెమలి పిట్టల్లా పురివిప్పుకొని బయలు దేరతారు. నాయంత్రం షాపింగుకు వెడదామా?

ఛా: ఆ వుద్యోగం విడిచిపెట్టిన దగ్గరనుంచి నా కదోలావుంది డాక్టర్!

డా: నర్సులకుండే గుణం నీకెలా పోతుంది? అణుకువ, పిరికితనం, ఆత్మనిరసన ఇవన్నీ వాళ్ల స్వభావాలు! వాళ్ళే కాదు; ఆడవాళ్ళే అంత. ఇంతకాలం కాలేజీలో చదువు కున్న పిల్లలు సైతం పెళ్ళికాగానే పిరికివాళ్లయి పోతారు. మగవాడిని చూడగానే తలుపుచాటుకు పారిపోతారు. చక్కగా పాడే పిల్లలున్నారా, అత్తవారింటికి పోగానే ఒక్క పాట పాడమంటే 'మర్చిపోయానండీ అబ్బే గొంతుక పోయిందండీ" అంటారు. మేరేజి అనేది పులిపిల్లలలాంటి మనుష్యుల్ని పిల్లిపిల్లల్ని చేస్తుంది.

ఛా: నర్సుగా చేరినప్పుడు ఇతరులమీాద ఆధార పడకుండా నా బ్రతుకు నేను బ్రతకగల్గుతున్నానుగదా అని తృప్తిపడే దాన్ని.

డా: వళ్ళువంచి ఏమీా కష్టపడకుండానే ఐశ్వర్యంతో తుల తూగే అవకాశాలున్నప్పుడు ఎవరికైనా అంతకంటె ఆనందమేముంది ఛాయా! ఆసుపత్రిలో అడ్డమైన చాకిరీ చేస్తూ నెలకొకసారి కడిగిపారేసిన ఆ జీతపురాళ్ళను చూసుకొని అదే యింద్రపదవి అనుకుంటున్నావా?

మోస్టు ఇన్నొసెంట్ వుమన్! (నవ్వి) అనాదినుంచీ నంటేంటి పొగలో వుక్కిరిబిక్కిరయే ఆడవాళ్ళ సైకాలజీ!

ఛా: అపుడు అంతో యింతో నేనూ త్యాగంచేసి మానవ సేవ చేస్తూన్నాను కదా అని ఆనందించేదాన్ని.

డా: (నవ్వుతూ) త్యాగం! మానవసేవ! ఎవరు చెప్పారీ కబుర్లు? యివన్నీ చెల్లని కరెన్సీనోట్లు; చెల్లని కరెన్సీని చేతబుచ్చుకొని బజారుకు వెడితే మనం ఏమౌతాం? ఈ ఆదర్శాలూ అంతే! వీటిని పట్టుకుని వేళ్ళాడే వాళ్ళని సమాజం బలిగోరుతుంది. మహాత్ముడు ఏమయాడు? ఏహింసనయితే ఆయన కాదన్నాడో ఆ హింసే ఆయన్ని...

ఛా: కాని గాడ్సేవంటి హంతకుడుసైతం ముందు చేతులెత్తి నమస్కరించనిదే మహాత్మునిపైకి పిస్తలు గురిపెట్టలేక పోయాడు డాక్టర్!

డా: అదే మోస్టు పోలిష్డ్ వే ఛాయా! నమస్కరిస్తూనే సమాజం మానవుల్ని హతమారుస్తుంది. భూమీ పుట్రా అమ్మి, చేస్తున్న వుద్యోగంవదలి, పస్తులు పడుకొని, పెళ్ళాంబిడ్డల్ని కుళాయి నీళ్ళకు వదలి, త్యాగం, త్యాగం అని దేశభక్తిపేరిట జైళ్ళలో జీవితం గడుపుతాడు ఒకడు. అతన్ని త్యాగపురుషుడనీ, పదవీ వ్యామోహంలేనిమహర్షి అనీ పొగుడుతూనే తమాషాగా పక్కకునెట్టి తాము మాత్రం పెద్దపెద్ద పీటలు వేసుకు కూర్చుంటారు, కొందరు. లాండ్రీలో బట్టలు విడిచి అక్కడే బట్టలు మార్చుకొని, కాకాహోటళ్ళల్లో టీ నీళ్ళుత్రాగి బీడీలు పీలుస్తూ రోడ్ల వెంట తిరుగుతూ కలలు కంటూ కమ్మని కవిత్వం రాస్తా

డింకొకడు; బ్రతికున్నన్నాళ్ళు వీడు బికారి! చనిపోయాక మహాకవి! అన్నంమాట ఆ పరబ్రహ్మకు తెలుసుగాని వీళ్ళకు రోగాలువస్తే ధర్మాసుపత్రులు కూడా మందునీళ్లు పోయవు. తెలుగుమందులమీద నమ్మకంలేక, ఇంగ్లీషు మందులు కొనుక్కోలేక హోమియోపతి మాత్రలు మింగి డెత్ వారంట్ మీద సంతకం పెడతారు. వాళ్ళు మరణిస్తే సంతాప ప్రకటనలు; స్మారక సభలు; మేకులు కొట్టినట్లు శిలావిగ్రహాలు! ఇది కుబేరులరాజ్యం ఛాయా!

ఛా: డాక్టర్! (నిట్టూరుస్తుంది.)

డా: వాళ్ళమీద నీ కెందుకు జాలి! తమ తిండీ. బట్ట, సుఖం మరచి లోకంలో తమకంటె దీనులు, నిర్భాగ్యులు. బైరాగులు మరెవరోవున్నా రనుకుని వాళ్ళను ఉద్ధరించ డానికే తాము పుట్టామని అనుకుంటూ రీ అవతార పురు షులు! అదీ ఒక కాంప్లెక్సే! అవతార పురుషులు! మరి ఆమాత్రం బాధపడరూ ఛాయా?

ఛా: నా కెందుకో భయమేస్తోంది. ఈ వూళ్లోంచి వెళ్ళి పోదాం డాక్టర్!

డా: నేనుండగా నీకేం భయం ఛాయా! నీ పేరు ఛాయ. ఛాయంటే నీడ. నీ నీడ కూడా ఎంత అందంగా వుంటుంది! ఏటిగట్టున అలలమధ్య కదులుతున్న నీ నీడను చూసు కుంటూ ఏవేవో కలలుకంటూ కూర్చుంటే ఎంత మధు రంగా వుంటుంది! అందుకే నిన్ను ఛాయా! అని పోయిటిక్ గా పిల్చుకుంటున్నాను.

ఛా: భోజనానికి లేవకూడదూ. ఆకలిగా వుందేమో!

డా: నువ్వు ఎదటవుంటే నాకు ఆకలేమిటి? ఇంకొక్క ఆరు నెలలలో మనం కుబేరులవుతాం. అప్పుడు ఆకలి అసలే వుండదు. ఈ డాక్టరుగిరీ యింకెన్నాళ్ళు? ఇంతా చేస్తే యివాళ మన ఫీజు రెండువేలే! పాపం వాళ్ళు అంతకంటె హెచ్చు యిచ్చుకోలేరు.

ఛా: ఎవరు?

డా: ఇందాక రాలేదూ మిస్టర్ శ్రీనివాస్! ఆంధ్రా కెమికల్ రీసెర్చి కంపెనీ మేనేజరు. పేషెంట్ పేదవాడనీ, యింతకంటె ఎక్కువ యిచ్చుకోలేడనీ, చేతులు కావు కాళ్ళని చేతులు పట్టుకున్నాడు పూర్ ఫెలో (డబ్బు ఛాయ కిస్తాడు) సాయంకాలం దౌలత్ రామ్ షాపుకి వెడదాం; నెక్ లస్ కొనుక్కుందువుగాని. అయినా యీ రెండు వేలేం సరిపోతాయి! సముద్రంలో కాకిరెట్ట! వచ్చే ఎలక్షన్‌లో మనం ఎం. పీ; ఎం. పీ. అయిన వుత్తరక్షణంలో మినిస్టర్! అప్పుడు నువ్వు ఎక్కడకు వెళ్ళినా ... పదవి వుంటే డబ్బుతో ఏం పని? పూలదండలూ, సన్మాన పత్రాలు, సందేశాలు, ప్రారంభోపన్యాసాలు, శంకుస్థాపనలు, ఆవిష్కరణోత్సవాలూ! ఏం ఛాయా! మనిద్దరం కారులో వెడుతూంటే మినిష్టరుగారు సతీసమేతంగా పర్యటిస్తున్నారని ట్రాఫిక్ బంద్!

జా: (కారియర్‌తో విసుగా వస్తాడు) ట్రాఫిక్ బందండయ్యగారూ! ఎవరో మినిష్టరుగా రొచ్చారట. రోడ్డు మీద జనాన్ని నిలబెట్టేశారు. లేకపోతే అప్పుడే వచ్చేద్దును. (లోపలికి వెళ్ళిపోతూంటాడు)

డా : ఏ మినిష్టర్రా ! సెంట్రలా ? ప్రొవిన్షియలా !

జా : ఏమోనండి; జనాన్ని మాత్రం సెంటర్‌లో నిలబెట్టేశారు!

డా : అయితే సెంట్రల్ మినిష్టరన్నమాట ! ప్లాను ప్రకారం నిలబెట్టించాడు మనుష్యుల్ని.

జా : సినిమాహాల్లో మీటింగండి. హాలుదగ్గర నిలబడి, నేనూ విన్నాను లౌడ్‌స్పీకర్లో. తెలుగులో ఏవో నాలుగు ముక్కలు మాట్లాడేసి ఇవతల కొచ్చేశారండి. మంత్రి గార్ని నేనూ చూశాను. మన తెలుగువారే !

డా : అయితే ప్రొవిన్షియల్ మినిష్టరన్నమాట. తెలుగు వాణ్ణి సెంట్రల్లో ఎందుకుండనిస్తారు లే !

జా : (లోపలికి వెళ్తూ) డైనింగ్ టేబిల్ రెడీచేస్తానండి !

డా : త్వరగా కానియ్ !

జా : ఎంతసేపు ? చిటికలో అంతా రెడీ ! (లోనికి వెళతాడు).

ఛా : నేనూ వస్తున్నాన్లే (అంటూ తానూ వెడుతుంది).

(డాక్టరు సిగరెట్టు తీసి వెలిగిస్తాడు. కుర్చీలో బద్ధకంగా కూర్చుని పేపరు తెరుస్తాడు. ఫోను మ్రోగుతుంది.)

డా : (బద్ధకంగా) జాన్ ! జాన్ !

జా . అయ్యగారు ! అయ్యగారు ! (గబగబ వస్తాడు.)

డా : ఆ కాల్ ఎక్కడనుంచో చూడు.

జా : (రిసీవరు తీస్తూ) హాలో ! హాలో !......ఎవరండీ ?... డాక్టరుగా రున్నారండి !...

డా : ఎవర్రా అది ?

జా : హాలో ! హాలో ! తమ పేరండి...ఆఁ. ఆహా. (డయల్

చూసి డాక్టరుతో) ప్రకాశరావుగారట, సిమ్మెంటు ఫ్యాక్టరీ ప్రొప్రయిటరుట !

డా : ఏమంటాడు ? నా సెక్రటరీలా, దర్జాగా మాట్లాడరా !

జా : హాల్లో ! హాల్లో. ఆఁ! ఆఁ! డాక్టరుగారికి ఆనక తీరు బడి వుండదండి. ఆఁ...ఇప్పుడే కారులో వస్తున్నారా ? ఓ; యస్; ఓ; యస్ ! (ఫోను పెట్టేస్తాడు.)

డా : అరెరె! అదేమిట్రా జాన్ ! పి. ఏ. లాగ మాట్టాడరా అంటే నా పీకలమీదకి యిప్పుడే ఎంగేజిమెంట్ ఫిక్సప్ చేశావు (నవ్వు).

జా : ఆనక మీకు తీరుబడేవండి ? భోజనం చేశాక నిద్ర పోతారాయె !

డా : ప్రకాశరావుగారా! ఎవరబ్బా! అర్జంటు పనుందన్నాడా?

జా : ఇంట్లో ఎవరికైనా హఠాత్తుగా మతిస్థిరం తప్పిందేమో !

డా : అంతేలే! అలాంటివాళ్ళే మన దగ్గరకొస్తారు.

జా : యీ లోపున మీరు మీల్సు తీసుకోకూడదండీ !

డా : ముందమ్మగారిని చేయమను ! నే నీ కేసేదో చూసు కొని వస్తాను !

జా : దబ్బున తేల్చేయండి !

డా : నీ కాకలిగావుంటే నువ్వో యీలోపున కానీయరా !

జా : నా కాకలిలేదండి. వస్తున్నప్పుడు దార్లో కాకిరాజుమిల్ట్రీ హోటల్లో భోంచేసే వచ్చేనండి (వెళ్ళిపోతాడు).

డా : (పత్రికతీసి చదువుతూ) తప్పిపోయినది. ఆచూకీ యిచ్చిన వారికి ఉచితరీతిని సత్కారం...... (ఆగి) మంచిఛాన్సే ! (చదువుతూ) పచ్చని శరీరం ! ఎత్తు యించుమించు అయిద

డుగులు. గుండ్రని మోము, పెద్దకళ్ళు, కుడిబుగ్గ మీంద చిన్న పుట్టుమచ్చ; నవ్వితే సుడులు తిరిగే చెక్కిళ్ళు వయస్సు ఇరవై రెండు. మూడు మాసముల గర్భిణి. పేరు శకుంతల. శకుంతలా! నువ్వు యీ ప్రకటన చూసిన వెంటనే తిరిగి రావలెను. నీకోసం పరితపిస్తున్న యీ నీ భర్త. (నవ్వి) "సెక్కిటా సిన్నా మచ్చా సెపితే సాలిరా లచ్చా" (పాటపాడుతాడు).

జా : (వస్తూ) మీలో మీరే నవ్వేసుకుంటున్నా రేటయ్య గారూ ?

డా : ఎవరో ఆధునిక శకుంతల, తప్పిపోయిందట. ఈ కావ్యం చదవరా ! ఆ శకుంతలను దుష్యంతుడు వదిలిపెట్టాడు ఈ దుష్యంతుణ్ణి ఈ శకుంతల వదిలిపెట్టింది! టిట్ ఫర్ టాట్; బ్లడీ కాళిదాస్ !

జా : (చదువుతాడు) తప్పిపోయినది ఆ చూకీ యిచ్చినవారికి ఉచితరీతిని సత్కారం.

డా : ఆధునిక శకుంతలోపాఖ్యాన మన్నమాట !

జా : ఉచితరీతిని సత్కారం అంటున్నాడు పేపరువాడు. నాలుగుపూటలు సైకిలుమీద వూళ్లో తిరిగేసి, పట్టి అప్ప గించేదా అయ్యగారూ! పాతికో పరకో చేతికందుతాయి !

డా : పాతికో పరకో చేతి కందడంమాట అలావుంచి ముందు నీ వీపు కాస్త రివిటవుతుంది. తనకర్మాన తను ఆఅమ్మాయి ఎవడితోనో ఎలోపయితే పేపరులో విరహం ప్రారంభిం చాడు భర్త. ఏదో మతిలేక తాను ఆ ప్రకటన పంపిస్తే ప్రచురించే న్యూస్ పేపరుకేనా వుండొద్దూ డీసెన్సీ ?

[ కారు హారన్ వినిపిస్తుంది; ప్రవేశం, ప్రకాశరావు. వయసు నలభై అయిదేళ్లు. ]

జా: అదిగో, ఆయనే కాబోలు ప్రకాశరావుగారు!

ప్ర: (వస్తూనే) గుడ్ మార్నింగ్ డాక్టర్ సాబ్!

డా: వెరీ, వెరీ! దయచేయండి, దయచేయండి! (అంటూ కుర్చీ చూపిస్తాడు.)

ప్ర: థాంక్యూ!...తమర్ని నేను కలియడం ఇదే మొదటి సారి!

డా: నాకూ అంతే! నేను తమర్ని యిదివరకు కలిసివుంటే; ఇప్పుడు మనం కలుసుకోవడం రెండవ సారౌను!

ప్ర: ఎంత మాట, ఎంత మాట! మీరా, నన్ను కలియడం! నేనే మిమ్మల్ని కలుద్దామని ఎన్నాళ్ళనుంచో అనుకోడం; ఎప్పటికప్పుడు ఏదో అడ్డు. ఇన్నాళ్ళయినా మీ పరిచయ భాగ్యం కలగనందుకు నాకు చింతగా వుంది!

డా: దానికేముంది! అస్తమానూ డాక్టర్ల అవసరం వుంటుందా మరి?

ప్ర: మీ గురించి క్లబ్ సెక్రటరీ చెప్పాడు సార్?

డా: ఎవరు? హారనాథా! ఏదో అభిమానంకొద్దీ, అతనలాగ చెబుతూవుంటాడు.

ప్ర: ఇంతకాలం మీ పరిచయం సంపాదించలేకపోయాను. మరి నేనూ క్లబ్ మెంబర్నే!

డా: అలాగా!

ప్ర: ఆవేళ తమ గౌరవార్థం టీ పార్టీ జరిగింది కదండీ!

డా: ఆఁ! అవునండీ! వొద్దన్నాను; వొద్దు వొద్దంటున్న కొద్దీ ఫ్రెండ్సు నలుగురూ మరీ బలవంతం చేశారు.

ప్ర: ఆ వేళ తమతో పరిచయం చేసుకుందా మనుకున్నాను; కానీ...

డా: పోనీ, ఇప్పుడయింది కదా; మనసులు కలియాలి కాని పరిచయాల కేం భాగ్యం?

ప్ర: బాగా సెలవిచ్చారు. ఏదీ కాని వేళ, మంచి మిడసరి లగ్నంలో వచ్చాను. ఏమీ అనుకోరుకద!

డా: ఈపాటికి దూఁమెరుగ్గాయింత పెరుగూ అన్నం తిని, కాస్త నేప్ తీసుకోవడం అలవాటనుకోండి! కాని ఏం చేస్తాం! పెద్ద మనుష్యులు వస్తున్నారుకదా అని మీ కోసం ఎదురుచూస్తూ కూచున్నాను.

ప్ర: ఇలాంటి సమయంలో మిమ్మల్ని డిస్టర్బ్ చేయడానికి నాకూ మనస్కరించడంలేదు. మన్నించాలి.

డా: డిస్టర్బెన్సు ఎప్పుడైనా ఒకటే; కానీయండి!

ప్ర: అలా అనకండి; వేళాపాళా వుండొద్దూ?

డా: మా దగ్గరకొచ్చే రోగులికి ఒక వేళాపాళా ఏమిటిసార్! తీర్థ ప్రజల్లా వాళ్ళు వస్తూనే వుంటారు; మేం వాళ్ళతో బాధలు పడుతూనే వుంటాం...ఏమిటి తమ కేసు?టూకీగా చెప్పండి!

ప్ర: కేసు, చాటభారతమంత వుంది. టూకీగా ఎలా చెప్పడం?

డా: మీ యిష్టమొచ్చినంతసేపు కూచుందాం; మీరేమిటి చెప్పాలనుకుంటున్నారో అంతా చెప్పండి...మీ పేషెంటు

లక్షణాలన్నీ పూసగుచ్చినట్టు వర్ణించండి ... పేషెంటు వయస్సెంత? మేలా? ఫిమేలా?

ప్ర: అబ్బే! రెండూ కాదండీ!

డా: అయితే న్యూటర్ జండరన్నమాట! మన పేషెంటుకి ఏజండరైనా బాధలేదు. సైన్సు యింతదాకా ఎడ్వాన్సయాక జండర్లతో ప్రమేయమేమిటి? ఒక్క ఆపరేషన్ చేస్తే మేల్, ఫిమేల్! ఫిమేల్, మేల్!!

ప్ర: దానిసిగతరగ; ఈ సైన్సుందే సైన్స్; తలుచుకుంటే అంతా చిత్రం!

డా: మహాచిత్రం! అందులోనూ మీలాంటి వాళ్ళకి ఏదైనా అబ్బురమే! మా కిది నథింగ్! సైన్సురంగంలో, ఈ ఎఛీవ్‌మెంటు నేను వియన్నాలో వున్నప్పుడే స్టేలాటు అయిపోయింది. ఒక ఆపరేషను సక్సెస్‌ఫుల్‌గా కండక్టు చేసేసరికి, యిక అంతా ఒకటే ఆపరేషన్. ఎవడు పడితే వాడు అండర్ టేక్ చేయడమే.

ప్ర: తమరు వియన్నాలో వున్నప్పు డేమయిందండీ?

డా: మా దగ్గరకో చిత్రమైన కేసొచ్చింది లెండి. ఎంత చిత్రమైనదో మీరు కళ్ళతో చూడవలసిందే; బయొలాజికల్‌గా మీకు ఎక్స్‌ప్లెయిన్ చెయ్యడం కష్టం.

ప్ర: మీరు చేసినా, మాలాంటివాళ్లకి బోధపడదు. మామూలుగా ఆ కేసు సంగతి చెబితే అదే మాకు పరమానందం!

డా: నేను వియన్నాలో 'థీసిస్' సబ్మిటు చేస్తున్నపుడు ఓ మజాఅయిన కేసువచ్చింది. అతనిపేరు మిస్టర్ రాబర్ట్.

వయస్సు ఓన్లీ సిక్స్టీన్ ! వాడే జండరో పోల్చుకోలేని తికమకలోపడ్డారు తల్లిదండ్రులు; నా దగ్గర కొచ్చారు. కేసు టేకప్ చేశాను. ఆపరేట్ చేశాను. మోస్టు సక్సెస్ ఫుల్ ఆపరేషన్. నా కత్తి పడగానే వాడి పేరు మారి పోయింది. మిస్టర్ రాబర్ట్స్, మిస్ హెలెన్ అయి కూర్చుంది. మిస్ హెలెన్ అందాలరాణి. మిస్ యూరోప్ పెరేడ్‌లో మిస్ హెలెన్, మిస్ యూరోపుగా ఎన్నికయింది. అప్పట్నుంచి ఆమె ఎక్కడకు నెళ్ళినా, ఆ అందాలబరిణ ప్రేమభిక్షకోసం, వేలకొద్దీ అబ్బాయిలు పెద్ద 'క్యూ'గా ఫారమయూరు. కానీ, ఒక హాలివుడ్ కుబేరుడు ఆ పిల్లను 'వ్యూ' చేశాడు. ప్రస్తుతం హెలెన్ ఆ హాలీవుడ్ కుబేరుని సతీమణి ! తమ అమెరికా పర్యటన అయిపోయిందట ! ఆద్యతన భావిలో ఆసియా రాజ్యాల పర్యటన వున్నదీ, భారతదేశ ప్రాచీన శిల్పావశేషాలనూ, కళాప్రాబల్యాన్నీ, సంస్కృతీ ప్రాభవాన్నీ వీక్షించి అవగాహన చేసుకోవాలని దంపతులం తహ తహ లాడుతున్నాం అంటూ మొన్ననే ఎంతో యిదిగా ఉత్తరం రాసింది. ... అహఁ! ... ఇదంతా ఆ పిల్ల ఇంగ్లీషు ఉత్తరానికి నా తెలుగు అనువాదం అనుకోండి ... ఈ మధ్యనే ఆ పిల్లకొక మగపిల్లవాడు పుట్టాడట; వాడికి నా పేరు పెడతానంటుంది; పిచ్చిపిల్ల !

ప్ర : మీరు చేసిన ఉపకారానికి ఎంతమంది బిడ్డలకి తమ పేరు పెట్టుకుంటే ఋణం తీరుతుందండీ !

డా : ఇందులో నా గొప్పేముంది ? ప్రతీవాడూ సైన్సుకి ఋణపడి వుండాలి. సైన్సులో పరమాణువు ప్రవేశించాక ఇదొక ఫీటా ? పరమాణువుతో ఏదైనా చెయ్యగలం. ఒక ప్రపంచాన్ని నిమషంలో భస్మం చెయ్యొచ్చు. ఇంకొక కొత్త ప్రపంచాన్ని సృష్టించవచ్చు. అడవులలో తిరిగే కోతులకు బ్రెయిన్ తగిలించి క్లబ్బులలో మనుష్యులతో పోకరాడించవచ్చు. మీ ఫ్యాక్టరీ ఎంపోరియంలో సేల్సు కండక్టు చేయించవచ్చు.

ప్ర : తమరు తల్చుకున్నారంటే ఏముందండీ ? మాలాంటి వాళ్ళకి ఎంతైనా సహాయం చేయగలరు.

డా : ఇంతకీ మీ రెందుకొచ్చారు చెప్పనిదే !

ప్ర : ఇవాళ ప్లానింగు మినిష్టరుగారు మన వూరొచ్చారు. తమకు తెలిసేవుంటుంది.

డా : వస్తే రానీయండి ! మనకేం ? ఆయనే మన పేషెంటా ?

ప్ర : కాదండీ. మీ రిద్దరూ క్లాస్‌మేట్సని విన్నాను. నా విషయం తమరు కాస్త ఆయనకు చెబితే అవలీలగా అయిపోతుంది. ఎరువుల ఫ్యాక్టరీ పెడుతున్నట్టు మీరు పేపర్లలో చూసేవుంటారు.

డా : (ఉత్తరం రాసుకుంటూ) ఆ ... ఫ్యాక్టరీ పెడితే నాకేం ?

ప్ర : ఇంకా ఎవరికీ లైసెన్సు యివ్వలేదండీ !

డా : (చీటీ రాసి) జాన్ !...జాన్ ! (జాన్ వస్తాడు)

ప్ర : (పేపరు తీసుకొని చదువుతున్నట్టు ఏమీ మాటాడక వూరుకుంటాడు)

డా: జాన్! ఈ చీటీప్రకారం మందులు కొని అతని కియ్యి! ఇంకొక వారంరోజుల్లో ఎలక్ట్రిక్ ట్రీట్‌మెంటు ప్రారంభిస్తాం అని చెప్పు; త్వరగా వెళ్ళు!

(జాన్ చీటీ చదువుకుంటూ బయటకు వెడతాడు)

డా: చాలా పెక్యులియర్ కేసండి! పాపం! ముందుకు రావలసిన కుర్రాడు. రెండు మూడు కావ్యాలు రాశాడట. ఏదో పరిషత్తులో తను రాసిన నాటకానికి ఫస్టు ప్రైజు రాలేదని బెంగపెట్టుకున్నాడు. మనసు వికలమయింది. కొద్దిగా మెంటల్ డిరైల్‌మెంటు! ఆఫ్టాల్ ప్రైజు ఫైటింగ్! చూడండి ఎంత సీరియస్‌గా తీసుకున్నాడో! స్పోర్టివ్‌గా వుండొద్దూ?

ప్ర: తమవంటి పెద్దలలా సెలవిస్తారు. కాని కాంపిటీషన్లో అలా అనిపించదు మరి. మన ఫ్యాక్టరీ లైసెన్సుకి అందరూ కాంపిటీషనే. తట్టుకోలేక నాకే మతిపోతోంది. మీరో చిన్నచూపు చూస్తే....

డా: మీకు వస్తుందన్నమాట!

ప్ర: అందుకే కదా మీ చెవులో వేసింది.

డా: నా ప్రొఫెషన్ వదులుకొని వాళ్ళచుట్టూ నన్ను తిరగమంటారా?

ప్ర: తిరగడ మెందుకండి? ఒక్కసారి మీరు వచ్చి చెప్పినా చాలు. ఓ ఉత్తరం రాసి యిచ్చినా ఇనఫ్!

డా: నన్ను మెత్తబెట్టకండి. లేనిపోని ఆబ్లిగేషన్స్!

ప్ర: మీదయ! ఆమాత్రం నన్నొక కాపుకాశారంటే...

డా : మీ మాట కాదన్నానని ఇంకోకలా అనుకోకండి. నా ప్రిన్సిపల్సుకి విరుద్ధమైన పని...

ప్ర : ఇందులో ఏముందిసార్ ! ఆ లైసెన్సు ఎవరికో ఒకరికి ఎలాగూ ఇవ్వాలి. ఆ ఇచ్చే దేదో మనకు యిస్తే...

డా : (పత్రిక చూస్తూ) సాధారణంగా నేనెవరికీ రికమెండేషను చేయనే !

ప్ర : అయితే మరీ మంచిదిసార్ ! ఎప్పుడూ చెయ్యనివాళ్ళు ఇప్పుడు చేస్తున్నారంటే దానికి పరపతి మరీ ఎక్కువ.

డా : కాలికి వేస్తే మెడకి, మెడకి వేస్తే కాలికీ; చంపుతున్నారే మీరు నన్ను !

ప్ర : అలా మీరు భావించడం ధర్మమా ?

డా : ఎన్నడూ అలవాటు లేనిపని, మీరు నన్ను చేయమంటున్నారు. మన్నించాలి !

(ఫోను మ్రోగుతుంది).

ప్ర : మీరలా అంటేకాదు.

డా : మీరు మరోకలాగ అనుకోకపోతే, కాస్త ఆ...

(ఫోను చూపిస్తాడు)

ప్ర : (ఫోను పట్టుకుని) ...హాలో ! ...ఎవరండీ ?...అహ్హా... (గాభరా పడుతూ, ఫోను దగ్గరకి డాక్టర్ని రమ్మని సౌజ్ఞచేస్తూ) నక్కతోక తొక్కి వచ్చానండి. ఇప్పుడే మాట్లాడేయవచ్చు; శ్రమలేకుండా, వెదుకుతున్నతీగె, కాలికి తగిలింది!

డా : (ఫోను చెంతకు వెడుతూ) ఇంతకీ ఎవరండీ ఆయన ?

ప్ర : ఇంకెవరు సార్ ! మన పి. ఏ., టుది మినిష్టర్ !

డా : ఓఁ ! ఐసీ ! [అంటూ, ఫోనుచేతబుచ్చుకుని] హాలో ... ఆఁ ... సరే; మీరెలా కనిపిస్తారోయ్ ! మళ్ళీ ఓట్ల సీజన్

లోనే; ఈ లోపున బాజూట్ ! ... మనవాడేదో పెద్ద మంత్రినై పోయాననుకుంటున్నాడా ! ... వచ్చే ఎన్ని కల్లో వాడి నియోజకవర్గంలో నిలబడి, డిపోజిట్లు గల్లంతు చేయిస్తానని చెప్పు ! ... ఏదీ. మనవాణ్ణి ఫోనుదగ్గిర కోమారు రమ్మను ! ... అబ్బే ! తమాషా కన్నాను. మీరెందుకు మా బంగళాకి రావడం ! సాయంత్రం నేనే అటువస్తాను ... నిద్రపోతున్నాడా ? ఊఁ మరి, గెస్టుగా వుంటే మనవాడికంతా రెస్టే ! కాస్సేపట్లో శతదినోత్స వమా; వెళ్ళిపోతారూ ? సరేలే; మరో రోజాయెను !

(ఫోను కింద పెట్టబోతాడు.)

ప్ర: చంపేశారు డాక్టరుగారూ ! ఇప్పుడే మాట్లాడేస్తే మన వ్యవహారం ఫైసలయి పోనుకదా !

డా: మిమ్మల్ని యింటర్‌డ్యూస్ చేస్తాను; ఆ వ్యవహార మేదో మీరే మాట్లాడుకోండి ! ... హల్లో !...ప్రకాశ రావుగారని, ఓ బిజినెస్ మాగ్నెట్; (ప్రకాశరావుని దగ్గరకు రమ్మని సౌంజ్ఞచేస్తాడు; మీరే మాట్లాడండని ప్రకాశరావు సౌంజ్ఞ చేస్తాడు) ... ఆయన్ని పంపిస్తాను. నాపనే అనుకుని నువ్వు కాస్త ...

ప్ర: తమరే వస్తామని చెప్పండి సార్ ! నేనయితే ఒక దాని కొకటి ...

డా: (ఫోనులో) హలో... నేనే వస్తానయ్యా... ఛీర్ యూ!

ప్ర: మీరు వెడితే ఆర్డరు టక్కున పడుతుందండి !

డా: కాగితా లెక్కడ వున్నాయ్ ?

ప్ర: అన్నీ ఆయన ఫైల్సులోనే !

డా: మీ ఫైల్సు ఎవరూ తీయించలేదుకద!

ప్ర: మీరే తీయించాలి; గప్‌చిప్‌గా ఆర్డరు వేయించాలి! (నోట్లు తీస్తూ) ఈ టెన్ థౌజండు...

డా: మీరేయివ్వకూడదూ?

ప్ర: నేనయితే ఆనక ఒకదాని కొకటి! కొంపలు మునుగుతాయి!... ఆఫీసర్లతో వ్యవహారం!

డా: భయంలేదు! నేను చెప్పానుగా!... నేను వెడితే, తీసుకుంటాడో, తీసుకోడో?... కావలిసినవాళ్ళం!

ప్ర: మీరూ మీరూ ఎంత కావలసినవాళ్లైనా, యీ వ్యవహారం మీది కాదుగదండీ!

డా: సరే; కాసేపు పోయాక బయలుదేరదాం...కూర్చోండి!

ప్ర: నే నెందుకండీ! సాయంకాలం మీ దర్శనం చేస్తాను.

డా: సరే; ఇక మీరు వెళ్లండి!

ప్ర: ఆర్డరు వేయించుకు రావాలి తమరు!

డా: చేతికి యిస్తానుగదా; చూద్దురుగాని!

ప్ర: ఆ ఆర్డరు చేతిలో పడితే...

డా: మళ్ళీ కనిపించరు; తురుపైపోతారు.

ప్ర: రామ, రామ. ఎంతమాట, ఎంతమాట! తమరే ఆ మాటంటే...

డా: మాటలతో ఏం పని? వెళ్ళిరండి!

ప్ర: తమరు ఆగ్రహించనంటే ఒక మాటంటాను; తమ ఋణం వుంచుకోను. తమకో కారు కొని...

డా: వాట్, మిస్టర్ ప్రకాశరావ్! నా కెందుకయ్యా మొక్కుబడులూ నైవేద్యాలూ!

ప్ర: ఏదో నోరు జారింది; ఆగ్రహించకండి!

డా: మీ బిజినెస్ ఫలిషయి తేవాలు; అదే నాకు సంతోషం.

ప్ర: మీ ఆశీర్వచనమే నాకు పదివేలు! సెలవు! మళ్ళీ తమ రక్షకుడకు నెళ్ళాలాయె!

డా: మీాల్సుతీసుకుని వెంటనే వెడతాను.

ప్ర: తమకు చాలా ట్రబుల్ ఇచ్చాను. క్షమించాలి!

(వెడతాడు.)

[నోట్లు బల్లమీద విలాసంగా ఎగురవేస్తాడు. సిగరెట్టు వెలిగిస్తాడు. కారుడు వెతుస్న ధ్వని. జాన్ ప్రవేశం)

డా: ప్రిస్క్రిప్షన్ ప్రకారం బాగా యాక్టుచేశావురా, జాన్! ఫోనులో నీ మాటలువిని మంత్రిగారి పి. ఏ వని నేనే అనుకున్నాను.

జా: అంతా మీరే మాట్లాడేశారండి. సరదాగా మాట్లాడదామనుకున్నాను. నన్ను మాటాడనిచ్చారేకాదు!

డా: నువ్వు నా సెక్రటరీవిరా, జాన్! వెయ్యి రూపాయల నోట్లు తానులు పరిపించి, వాటిమీద నీచేత నడిపిస్తాను. ఏదీ ఆ ప్రిస్క్రిప్షన్ కాగితం?

జా: ఇదిగోనండి!

డా: (చించి పారవేస్తూ) ఇం కెందుకీ ప్రిస్క్రిప్షన్? పది నిమిషాల ట్రీటుమెంటుకి పదివేలు ఫీజు!

జా: ఈ పదివేలూ మన దగ్గరే వుండిపోతాయాండి?

డా: ఇవి మన యింట్లో పిల్లల్ని పెడతాయిరా! కాకపోతే, నువ్వు మాతో న్యూయార్కు ఎలా వస్తావురా, వెర్రి కుట్టే!

జా: మా అయ్య లండన్ వెళ్ళాడు. నేను న్యూయార్కు వెళతాను!

[ఛాయ మేడమెట్లు దిగుతూ 'జాన్' అని పిలుస్తుంది. ఆమె రాక గమనించి, డాక్టరు నోట్లు దాచుకుంటాడు.]

డా: ఊఁ! స్టువర్టు బంగాళాకి వెళ్ళి, నేను పంపించానని చెప్పు!

జా: (మొదట అర్థం కాక, తరవాత తెలుసుకొని) అలాగే నండి! వెళ్ళి, కుక్కను పట్టుకువస్తాను!

[డాక్టరు లోపలకు వెళ్ళిపోతాడు. ఛాయ, కుర్చీచెంతకు వచ్చి నిలబడుతుంది.]

ఛా: జాన్!

జా: ఏవఁమ్మగారూ!

ఛా: ఈ ఉత్తరం శ్రీనివాసరావుగారి కిచ్చిరా; జాగ్రత్తగా పట్టుకువెళ్ళు; ఎవరికీ చూపించకు; త్వరగారా.

(ఉత్తరం యిస్తుంది)

జా: అలాగే నమ్మగారూ! ఎమ్మెన్నా వచ్చేస్తాను!

[కవరుమీద చిరునామా చదివి, గబగబ ముందుకు నాలుగు అడుగులు వేస్తాడు.]

— తెర —



# పంజరం

## ద్వితీయాంకం

సమయం : అదేరోజు, సాయంకాలం

స్థలం : అదే.

తెరలేచేసరికి ఛాయాదేవి లోనుంచివచ్చి పంజరంచెంత ఆగకుండా ఆ ప్రక్కనుంచే ఇవతలకు వస్తూవుంటుంది. ఎవరిరాకకోసమో నిరీక్షిస్తున్నట్లు వీధిగుమ్మంవైపు ఆతృతగా చూస్తుంది. రెండు మూడడుగులు అటువేస్తుంది. పంజరంలోని చిలుక 'రామా, రామా!' అంటుంది. ఛాయ ఒక అడుగు ముందుకు సాగుతుంది. చిలుక మళ్ళీ 'రామా రామా!' అంటుంది. చిలుక పలుకులు విని ఛాయ నిట్టూర్చి అటు మళ్ళుతుంది.

ఛాయ : రామా! రామా! అని నోరారా పిలుస్తున్నావ్ నువ్వు ఎంత తీపిగా పిల్చినా, నీ రాముడు వినిపించుకోడేమే! సీతాదేవిలా పాపం, ఎందుకు నీకీ చెర? వెళ్ళిపో. హాయిగా వెళ్ళిపో. ఇంతకన్న నీకు అడివే సుఖం. స్వేచ్ఛగా ఎగురుతూ, ఆనందంగా రోజులు వెళ్ళబుచ్చుదువుగాని! (పంజరం తెరుస్తుంది; చిలుక వదలదు; మెల్లగ

ఊఁ! కదలవ్వూ? అవున్లే; అక్కడైతే నీ తిండి నువ్వే సంపాదించుకోవాలి; ఇక్కడైతే నీ కే తాపత్రయమూ లేదు. జామిపళ్లు కోసి రోజూ నీ ముందు పెడతాడు మా జాన్! ఇంతలోనే ఎంతసుఖం మరిగిపోయేవే! చిత్రం!

[జాన్ బయటనుంచి లోపలకి వస్తాడు. ఛాయను కొద్ది దూరంలో ఆగిపోతాడు. ఆమె అతన్ని గమనించదు.]

జా: అమ్మగారూ!

ఛా: (ఉలిక్కిపడి) వచ్చావా? నీకోసమే ఎదురు చూస్తున్నాను. ఆయన...

జా: ఆయనకోసం ఊరంతా తిరిగేనండి! కాళ్లరిగిపోయాయి; తలప్రాణం తోకకు వచ్చింది. ఇక్కడ కాదని అక్కడ, అక్కడ కాదని ఇక్కడ...

ఛా: అక్కడికీ ఇక్కడికీ ఎందుకురా? తిన్నగా ఆయన ఆఫీసుకి వెళ్లక!

జా: ఎకాఎకీ అక్కడికే వెళ్లానమ్మగారూ! వెడితే, గేటువాడు ఎంతకీ లోపలికి పోనీయడూ. చివరికి ఓ పావలా డబ్బులు వాడి చేతిలోపడేసి మంచి చేసుకున్నాను. తీరా, లోపలకెళ్లి, భోగట్టా చేసేసరికి, "ఇక్కడ శ్రీనివాసరావనే మేనేజరు లేడు; పోపో" అని కసిరిపారేశారండి.

ఛా: లేకపోవడమేమిట్రా? పొద్దున్నే ఆయన మనింటికివస్తే!

జా. అదే నాకూ పట్టుకుందండి. రూపాయో, రెండో చేతిలో పడితే ఆఫీసులో నిజం చెప్పేసి పోదురు. కాని, డబ్బు దండుగెందుకని, ఆఫీసుటైము అయిందాకా అక్కడే

కాసుకొచ్చున్నాను. ఆఫీసర్లంతా ఇళ్లకు పోతున్నారు కాని, శ్రీనివాసరావుగారు మాత్రం ఐపూ జాడా లేదు.

ఛా: ఏ ఆఫీసుకు వెళ్లేవో ఏమిటో ?

జా: ఆంధ్రా కెమికల్ రీసెర్చి కంపెనీ కదండీ; మంచివారే! బోర్డు చదువుకొని మరీ లోపలికి వెళ్లేను. లోపల లేక పోయేసరికి మళ్ళీ యివతలకివచ్చి గేటువాడికి మరో పావలా గప్‌చిప్‌గా అందించి, మెల్లిగా కూపీ లాగేను. శ్రీనివాసరావుగారు, హెడ్డాఫీసు మేనేజరుట. అది కాకి నాడలో వుందిట. ఇది బ్రాంచి ఆఫీసు. ఆయ నీ మధ్య యీ ఊరే రాలేదు పో పో అన్నాడండీ గేటువాడు. నీకేం తెలుసు గోంగూర పులుసు; పొద్దున్న మా యింటికి వచ్చారు పోరా! అని నాలుగు చివాట్లువేసి చక్కా వచ్చాను.

ఛా: హెడ్డాఫీసునుంచి రాగానే బ్రాంచి ఆఫీసుకు వెళ్లకుండా మనింటికి వచ్చివుంటారు. పోనీ, ట్రావెలర్సు బంగళాకి వెళ్ళలేక పోయావా? అక్కడ దిగేరేమో!

జా: అరెరె! అక్కడికి కెళితే యిట్టే ఒక్కరూ దొరికి పోదురూ! అనవసరంగా క్లబ్ దగ్గర కెళ్లాను.

ఛా: కనిపించారా ?

జా: కనిపిస్తే ఏం లాభమండీ! తీరా కనిపించేసరికి ఆయన అవునా, కాదా, అని చిన్న అనుమానం పట్టుకుంది, దానింటా పంటూరంగానూ!

ఛా: ఇంతకీ ఆయన్ని కలుసుకున్నావా? లేదా ?

జా: ఎలా కలుసుకోవడమండి? ముందు ఆయ నవునో కాదో తేల్చుకోవాలా? ఒకవేళ ఆయన శ్రీనివాసరావు గారే అయినా నేనెలా కలుసుకుంటాను, పదిమంది లోనూ పేకాడుతూ కూర్చుంటే? గొప్ప డైనమాల్లో పడిపోయా నమ్మగారూ! అక్కడే అలా ఒడి పేసుకు నించున్నానండి. సిమ్మెంటు ఫ్యాక్టరీ ప్రొప్రయిటరు ప్రకాశరావుగార్ని మట్టుకు యిట్టే పోల్చేశానమ్మగారూ! ...ఆ పంచా ఆయనా...వున్నట్టుండి, గబుక్కున ప్రకాశ రావుగారు లేచి "శ్రీనివాసరావ్ నీ పని కుదేల్" అన్నా రండి. అమ్మయ్య! ఆయనేకదా అని ఎప్పుడయినా ఒక్కరే యివతలకు రారా అని గంటలతరబడి కూచు న్నాను. పేకాటలో పడి ఎంతకీ రాడు, బ్రహ్మదేవుడు. అయ్యగారు లేస్తే కోప్పడతారని గబగబా వచ్చేశాను.

ఛా: అయితే ఆయనకి వుత్తరం యీాయ లేదన్నమాట?

జా: లేదండమ్మగారూ!

ఛా: ఎందు కివ్వలేదు? ఎలాగయినా ఆయన కిచ్చి రమ్మ న్నానా లేదా?

జా: ఇమ్మన్నారండి. వీలు పడలేదు. ఒక్కరూవుంటే యిచ్చి వద్దును.

ఛా: ఒక్కరూ యివతలకు వచ్చేవరకూ వుండలేకపోయావా? హాస్పటలులో వున్నప్పుడు నువ్వు నేనంటే ఎలా వుండే వాడవురా? ఇక్కడికొచ్చాక అలా మారిపోయావేం? నాకు తెలుసురా, నువ్వూ నన్ను మోసగిస్తున్నావు! (కవరు చించి నోట్లు చూసుకుంటుంది. టేబిలుమీద లెటరు, కవరు వేరే పడివుంటాయి. నోట్లు చేతితో పట్టుకుంటుంది.)

జా: నే నేం మోసం చేశానమ్మగారూ? తల్లీ తండ్రీ అన్నీ మీరేననుకుని మిమ్మల్ని నమ్ముకుని వుంటే, నాకే చీకూ చింతా వుండదనుకున్నాను. ఆ నౌకరీ వదులుకోని మా అమ్మగారితో వుంటే నాకేం భయం లేదను కున్నాను. మీరు రమ్మనగానే మీతో వచ్చేశాను. హాస్పటల్ వున్నప్పుడు అంత నమ్మకంగా మసిలినవాణ్ణి...

ఛా: అయితే నాదగ్గరెందుకంత భయపడుతున్నావ్? నాకు తెలుసురా! నువ్వు నాదగ్గర అబద్ధాలాడుతున్నావ్. అన్నీ దాపరికాలే! అందరూ మోసాలే!

జా: నేనే పాపం ఎరగనమ్మగారూ! ఇందాకా అయ్యగారు చీటీ రాసి దాని ప్రకారం ఫోను చెయ్యమంటే చేశాను. నాతో ఫోనులో అంతా ఆయనే మాట్లాడేరు. అయ్య గారి మాట వినకపోతే ఎలాగ అమ్మగారూ? ఇంటికొచ్చే సరికి ప్రకాశరావుగారు వెళ్ళిపోయారు. ఏదో సిఫారసు చెయ్యమని పదివేలిచ్చారు!

ఛా: ఏమని ఫోను చేశారు? చీటీ ఏమని రాశారు?

జా: నాకు జ్ఞాపకం లేదమ్మగారూ! మంత్రిగారికేదో సిఫారసు మాత్రం...

ఛా: పొద్దున్న నాకు రెండువేలు యిచ్చినతనికి మళ్ళీ ఆ డబ్బు యిచ్చావా? లేదా?

జా: అయ్యగారు నాకివ్వలేదండి!

ఛా: శ్రీనివాసరావుగారు డాక్టరుగారికి ఫీజిచ్చారా?

జా: ఇచ్చారో లేదో నేను చూడలేదమ్మగారూ!

ఛా: నువ్వెక్కడ లేవూ? అబద్ధమాడకు. నిజం చెప్పు.

జా : నిజమేనమ్మగారూ! నేనక్కడ లేను. మీ ముగ్గురూ మాట్లాడుకుంటుంటే లోపలకు వెళ్ళిపోయానుకదమ్మా; చెవలపిల్లులు అల్లరిచేస్తున్నాయని!

ఛా : నేనడిగేదొకటి, నువ్వుచెప్పేదొకటి. ఒక్కదానికన్నా నువ్వు సరిగ్గా సమాధానం చెప్పడంలేదు. నువ్వూ నామీద పగబట్టేవుట్రా?

జా : నేనేం పగబట్టే నమ్మగారూ?

ఛా : హుం!... కాలమే, నామీద పగబట్టింది; నా జీవితమే నా మీద విచ్చుకత్తులు విసిరింది; నేను నడిచే బాటమీద బాకులు పరిచింది. ఈ పరివేదన, కన్నీళ్లు, అవమానం, పరాభవం నన్ను వెంటాడడానికి నే నే నేరంచేశానని? ఎవర్ని అన్యాయం చేశానని? ఎందుకు నా కీశిక్ష?
(ఆవేశంతో వీధివైపు నడుస్తుంది. టేబిలుమీద వున్న కవరు క్రింద పడిపోతుంది. అది ఆమె గమనించదు.)

జా : అమ్మగారూ! అమ్మగారూ! ఎక్కడికండమ్మగారూ!

ఛా : నేనే వెళతాను. ఆ శ్రీనివాసరావుగారితో నేనే మాట్లాడతాను.

జా : నేనూ వస్తా నమ్మగారూ!

ఛా : వద్దు; నువ్విక్కడేవుండు. అయ్యగారు లేచాక ఫ్లాస్కులో కాఫీవుంది; యియ్యి!

[ఆమె వెళ్లిపోతుంది. దిగులుగా, జాన్ వీధిగుమ్మంవైపూ, మేడ మెట్లవంక చూస్తాడు. ఉన్నట్టుండి గుబుక్కున క్రిందకుచూసి కవరు తీస్తాడు; సంశయిస్తూ మేడమెట్లవైపుచూస్తూ ఉత్తరం తెరుస్తాడు.]

జా : (ఉత్తరం చదువుతూ, మధ్య మధ్య అటు ఇటు చూస్తూవుంటాడు.) శ్రీ శ్రీనివాసరావుగారికి; ఈ ఉత్తరాన్ని ఎంతో బాధ

పడుతూ రాస్తున్నాను...అన్యరాష్ట్రాలలో మీ రేదో వుద్యోగంలో వున్నారని నేను వినడమేకాని, ఈవేళవరకు మిమ్మల్ని చూసే భాగ్యం నాకు కలగలేదు. మీ మంచితనాన్నీ, ఉదారస్వభావాన్నీ ఆయన తరుచు చెబుతూవుండేవారు...పొద్దున్న మీ మాటలనుబట్టి, మీరు నన్ను అపార్థం చేసుకోలేదని తెలుసుకున్నాను. అప్పుడు నేను పతితనుకాను. ఇప్పుడు పతితనో, కానో... ఒక విచిత్ర పరిస్థితిలో పడిపోయాను. నన్ను ఆయన విడిచిపెట్టాక, యింకొక వివాహం చేసుకుని కాలం వెళ్ళ బుచ్చాలని ఆశించాను. భుక్తికోసం నర్సువృత్తి స్వీకరించేముందు, నేను అనాథనని చెప్పుకోవలసిన దుస్సంఘటన తటస్థించింది. అదే, నా భర్తకు నా జీవితంలో నేను చేసిన అపచారం. అందర్లాగే, డాక్టరు సైతం నేను వితంతువుననే అనుకుంటున్నాడు. నేను వితంతువును కానని, నా భర్త నన్ను వదలిపెట్టారని, డాక్టరుకి స్పష్టంగా చెప్పాలనే అనుకుంటున్నాను. కాని అందుకు యింతవరకు వీలుచిక్కలేదు. మాకు వివాహమయేలోపున, మీ రిక్కడకువస్తే మా సంబంధాలు అల్లకల్లోల మౌతాయని నా భయం. మనసు వికలంగావున్న నా భర్తను నేను చూడలేను; ఆయనబాధలు చూసి ఓర్చుకోలేను. మళ్లీ గత స్మృతులు నన్ను కలచి వేస్తాయి. కనక ఆయ న్నిక్కడకాక, మరెక్కడికయినా తీసుకువెళ్లి బాగుచేయించండి. నా కనేకవిధాల మన శ్శాంతిని కల్పించండి. జీవితంలో ఇంతకంటె మిమ్మల్ని అర్థిం

చేది యింకొకటి వుండదు...డాక్టరుగారికి మీ రిచ్చిన ఫీజు యిందుతో మీకు పంపిస్తున్నాను...మన్నించండి... సెలవు. — జ్యోతి.

[జాన్ నిశ్చేష్టుడై అలాగే నిలబడిపోతాడు. డాక్టరు మేడ మెట్లు దిగుతూ మెల్లగా వస్తాడు.]

డా: ఇంతసేపూ ఏంచేస్తున్నావురా; అప్పుడే ఆరున్నర అయింది. లేపకపోయావూ నన్ను?

జా: [కొంచెం చలించి సర్దుకుంటాడు. తన చేతిలోని ఉత్తరం డాక్టరు చూస్తాడేమోనని భయపడతాడు. దాచుకుందుకు వీలుపడదు.] నిద్ర పోతున్నవాళ్ళని లేపకూడదని మా అయ్య చెప్పాడండి!

డా: ఏడిశాడు!...నన్ను చూసి ఎందుకలా బెదురుతావ్?

జా: కోప్పడుతున్నారు గదండి!

డా: కోపం లేదు తాపం లేదు! అలా 'డీ'లా పడిపోయావేం? ఒంట్లో కులాసాగా లేదా?

జా: ఇందాకట్నుంచీ, అదోలా వుందండి!

డా: అదోలా వుండడమేమిట్రా నీ మొహం! (అతన్ని తేరిపారచూసి) చేతిలో అదేమిట్రా? ఉత్తరమా?

జా: ఊఁ!

డా: డబ్బుపంపించమని మీ అమ్మ ఉత్తరం రాసిందట్రా?

జా: అవునండి.

డా: అలా చెప్పు! పంపుదువుగాని; ఏదీ చదువు!

జా: (నవ్వుతూ) మీరు వినకూడదు; ఇది వేరే విషయం!

డా: ఎందుకు వినకూడదు? మీ అమ్మ నీ కెవరినైనా అమ్మాయినిచూసి ముడిపెడతా నంటోందా?

జా : మ రేనండి ! అ దే దానితో వచ్చిన చిక్కు !

డా : ఏం ? నీ కాపిల్ల నచ్చలే దేమిట్రా ?

జా : పల్లగా చీంబోతులా వుంటుందండి. ఉత్తి పల్లెటూరి ముద్దు. పట్నంవస్తే దానికంతా చిత్రమే. దాన్ని చేసుకోమని మా అమ్మ నన్నూరికే రొఖాయిస్తోంది.

డా : ఒద్దు ఒద్దంటే ఇష్టంలేని పిల్లని ఎందుకు నీకు కట్ట బెడతా నంటోంది, మీా అమ్మ ?

జా : ఆ పిల్ల, దాని తమ్ముడి కూతురు కదండీ!......నా మనసు ఎవళ్ళమీాదుందో తెలుసుకోకుండా...

డా : తన మేనగోడల్ని చేసుకోమని, బలవంతం చేస్తోం దన్న మాట! ఆనక మీాకూ మీాకూ మనసు కలియకపోతే! బ్లడీ ఫెలోస్; బ్లడీ మే రేజస్! ఆ పిల్లను చేసుకోనని, యిప్పుడే మీా అమ్మకు వుత్తరం రాయి. కాగితం కలం పుచ్చుకో. సమాధానం చెబుతాను; ఏదీ ఆ లెటరు!

జా : ఇది మా అమ్మ దగ్గర్నుంచి కాదండి!

డా : మరి?...అలా సిగ్గుపడతా వెందుకురా! నీమనసిం కెవరి మీాదో వుందన్నాన్!...ఆ అమ్మాయి లా లెటరు రాసిందా ?

జా : అవునండి. ట్రెయినింగు చదువుతోంది. "చదువుకున్న పిల్ల, నామాట వినదూ; మేరీని చేసుకోవద్దంటోంది" మా అమ్మ!

డా : ఆమాట చెబితే నీకీపాటికి చర్చిలో పెళ్ళి చేసేద్దును! చెప్పేవుకా వేం! జాన్ – మేరీ! హేపీ కపుల్! ఏమని రాసిందిరా, నీ మేరీ ?

జా : ఏమి ఏమిటో రాస్తుంది! అవన్నీ నా నోటితో ఎలా చెప్పగలను! ఎంత చెప్పినా, మా అమ్మ ఎలాగా ఒప్పుకోదు!

డా : నువ్వు ఆ పిల్లను లౌవ్ చేస్తే మీ అమ్మ ఒప్పుకోక పోవడమేమిటి? నాన్సెన్స్! ఆ వుత్తరం యిలా తే! మేరీని వెంటనే రమ్మని వుత్తరంరాసి మీ యిద్దరికి మేరేజి చేసేస్తాను. (ఉత్తరం తీసుకుందుకు చేతులాడిస్తాడు.)

జా : (రెండడుగులు వెనక్కి వేసి) ఎందుకు లెండయ్యగారూ! (అంటూ ఉత్తరం నోట్లో కుక్కుకుంటాడు)

డా : (నవ్వుతూ) అరె! తా లెటరు చక్కగా ఫ్రేము కట్టించుకొని యింట్లో దాచుకోవాలిరా! మేరేజ్ అయాక మేరీ చూస్తే ఎంత సంతోషిస్తుంది! పూర్ ఫెలో! లోపల కెళ్ళి కాస్త కాఫీ పట్టుకురా! (జాన్ వెళ్తుంటాడు) చేతులు శుభ్రంగా కడుక్కో!

జా : (ఓ క్షణం పోయాక కాఫీతో ప్రవేశం) క్రోటన్సుకి నీళ్ళు పోసి వస్తాను. (కాఫీ పెట్టి వెళ్ళిపోతాడు)

డా : (కాఫీ త్రాగుతూ)జాన్...నాకోసం ఎవరయినావచ్చేరా?

జా : లేదు. ఎవరు రావాలి?

డా : శ్రీనివాసరావుగారు. మేనేజరై వుండి టైమ్ కీపప్ చెయ్యకపోతే ఎలా? ఆయనొస్తే కూర్చోమను! (లోపలకు వెళ్తూ) ఛాయా! ఛాయా!

జా : అమ్మగారు యింట్లో లేరు.

డా : ఎక్కడికి వెళ్ళారు?

జా : తెలీదు!

డా : నీతో చెప్పలేదూ ?

జా : లేదు.

డా : ఎంతసేపయింది ?

జా : ఇప్పుడిప్పుడే !

డా : షాపింగుకి వెళ్ళివుంటుంది !

జా : అంతేనండి ! డబ్బుకూడా తీసుకు వెళ్ళారు.

డా : ఇక నేం ? రెండు వేలిచ్చాను. చేతిలోవున్న డబ్బు ఖర్చు కాస్తా తగలేసేవరకు నిద్రపట్టదు ఆడవాళ్ళకి !

[తుఫానులాగ పిచ్చివాడు ప్రవేశిస్తాడు]

పిచ్చివాడు: (డాక్టరు ఎదురుగా నిల్చుని) నా ఉత్తరా లెందుకురా చదువుతారు ? డిస్మిస్ చేస్తా ! వెధవడిపార్టు మెంటూ మీారూ ! [దర్జాగా కుర్చీలో కూర్చుని] రోజుకో మనియార్డరు పట్టుకురావోయ్ పోస్టుమాన్ ! సంతకంచేసి పుచ్చుకుంటాను !

జా : [తెల్లబోతూ, భయంగా] ఈయ నెవరండీ, డిస్మిస్ చేస్తానంటూ చడీచప్పుడూ లేకుండా కుర్చీలో కూచుని ఠకాయిస్తున్నాడు !

డా : [పిచ్చివాణ్ణి చూసి, నవ్వుతూ] ఏమిటి మన కథ, మై డియర్ డ్యూకాఫ్ ఎడిన్బరో !

పి : ఛాంబర్లేన్ అంబరిల్లా, లాయిడ్ జార్జి బాల్డ్ హెడ్, చర్చిల్ సిగర్ !

డా : అవన్నీ ఔటాఫ్ డేట్ ! మాట్లాడక కూచో.

పి: నా క్లాసులో, ఆ గుంటలచేత ఎందుకలా అల్లరి చేయిస్తారు; కో లెక్చరర్లయివుండి! బుల్‌డాగ్ ఫేసెస్! లాబీవర్గాల్లో గుసగుసలు!

డా: టర్కిష్ మాలిష్ చేయిద్దాంలే; కొంచెం శాంతించు.

పి: నోటీసు లంటించకూడదని, నా గోడమీద బోర్డుందా లేదా? చదువుకుని కూడా, ఎందుకు రాసేవు ఆ రాతలు? ఎవరు నువ్వు?

డా: దడిగాడు వానసిరా.

పి: వానసిరా; సిరా వాన! కురిపించి అక్షరాల విత్తులు జల్లి...

డా: అలాగేలే! అలాగే!

జా: అయ్యగారి పని మహా జోరుగావుంది!

[ప్రవేశం: శ్రీనివాసరావు]

శ్రీ: నమస్తే డాక్టర్‌సాబ్!

డా: నమస్తే, నమస్తే...ఏమి టీయన...

శ్రీ: మీ పేమెంటు!

డా: (నవ్వుతూ) మీ కజిన్ అన్నారే, ఇతనేకదూ?

పి: నో ఇన్ట్రొడక్షన్; యూ జెస్టు ఫాలో ది టెక్ట్స్.

శ్రీ: అవును; ఇతనే మా కజిన్! ఆలస్యమైంది; క్షమించాలి!

డా: మీవాడొక్కడే తుఫానులా వచ్చేసరికి, మా జాన్ ట్రెంబులయ్యాడు! అలాగ మా మీదికి ఒక్కణ్ణే వదిలి పెట్టడం...

శ్రీ: మన్నించాలి. ఇద్దరం కలిసేవచ్చాం...కాని, పర్సులో వెయ్యిరూపాయలు పెట్టుకుని ... రోడ్డుమీద రిక్షాదిగి

మీా గేటుదాకా వచ్చేసరికి, ఫీజుమాట జ్ఞాపకం వచ్చింది. జేబుచూసుకుంటే పర్సు కనిపించదాయె !

డా: అరె, ఇంతలోనే ఏమైపోయిందండీ, మీా పర్సు ?

శ్రీ: అదే ఆశ్చర్యం! ఎలక్ట్రిక్ షాక్ తగిలినట్లు మొహం జుమాలుమంది; అక్కడే నిలబడిపోయాను. వీడి ధర్మమా అని ఇక్కడ దూరేడు. లేకపోతే పర్సుమాటకేం, వీడి కోసం ఊరంతా గాలించవలసి వచ్చేది !

డా: కొంపతీసి మీా జేబెవరైనా కత్తిరించారేమో ?

శ్రీ: కత్తిరిస్తే కత్తిరించినట్టు అప్పుడే తెలిసిపోనుకదూ!

డా: అదే వాళ్ళ స్కిల్! మనకి తెలియకుండానే కత్తిరిస్తారు.

శ్రీ: జేబులన్నీ మామూలుగానే వున్నాయి !

డా: అన్నీ మామూలుగా వుండగానే పోతాయిలెండి. అదే వాళ్ళ నేర్పు.

శ్రీ: ఆపళంగా రిక్షావాడి దగ్గరకి పరుగెత్తాను. అప్పుడే వెళ్ళిపోతున్నాడు. "ఏయ్ రిక్షా ఆపు" అన్నాను.

పి: హిట్లరూ, నెపోలియనూ అన్నదమ్ములే. నిన్ననే ఇద్దరూ కలుసుకొని సంధికుదరక బట్టలు చింపుకొని పిరాబుడ్లతో కొట్టుకున్నారట.

డా: రిక్షావాడు పర్సు కొట్టేశాడా ?

శ్రీ: లేదు లెండి. పాపం! పర్సు రిక్షాలోనే వుండి పోయింది, వాడసలు చూడలేదు.

డా: ఓసారి ఏమైందంటే...సమ్మరు క్యాంప్‌కని మస్సోరి బయలుదేరాను. ఫస్టుక్లాస్ బెర్తు రిజర్వుచేయించుకున్నాను.

కంపార్టుమెంటులోకి ఎంటరయ్యాను. సీటుమీద కూర్చు న్నాను. కోటు జేబు తడుముకుచూస్తే పర్సు కనిపించదు.

శ్రీ : కంపార్టుమెంటులోకి ఎంటరవుతున్నప్పుడు ఎవరైనా కొట్టేశారేమో ?

డా : లేదండి. నా వెనక ఎవరూ లేరు. రిఫ్రెష్మెంటు రూములోంచి సరాసరి కంపార్టుమెంటులోకి వచ్చేశాను.

శ్రీ : అయితే రిఫ్రెష్మెంటు రూములో పోయివుంటుంది !

డా : కంపార్టుమెంటులో ఎక్కుతున్నప్పుడు చూసుకున్నాను.

శ్రీ : పర్సుందా ?

డా : ఉంది !

శ్రీ : మీముందెవడో నిలబడి మస్కా కొట్టేడు.

డా : నాముందు ఎవరూ లేరండీ !

శ్రీ : కూర్చునేటపుడు క్రిందపడుంటుంది.

డా : కంపార్టుమెంటంతా వెతికానుకదండీ !...పర్సు కని పిస్తేనా !

శ్రీ : మీ పర్సు చాలా చిత్రంగా పోయిందే ! ప్లెజర్ ట్రిప్ కేన్నిలు చేసుకున్నారా.

డా : చెక్ బుక్ పెట్టెలో వుంది లెండి.

శ్రీ : పర్సులో ఎంతుంది ?

డా : ఓ టు థౌజండ్ !

శ్రీ : అబ్బా ! పెద్ద ఎమౌంటే !

డా : ప్చ్ ! నథింగ్ !

శ్రీ : పోయినప్పుడు అలాగే అనుకోవాలిలెండి మరి.

డా : పర్సుపోయినందుకు విచారం లేదుకానండీ, పౌరుషం పట్టుకుంది. పోనుపోను ఆ పౌరుషమూ పోయి వాడి నేక్ ఎంతటిదో అనే ఆశ్చర్యం, వాడు కనిపిస్తే ఆ డబ్బు వాడికే ప్రెజెంటు చేయాలనే ఐడియా కలిగేయి. చివరికి ప్రెజెంటు చేసే అవకాశమే కలగలేదు!

శ్రీ : వాడుకనిపిస్తే మీరు ప్రెజెంటు చేద్దురన్నమాట.

డా : ఎందుకేనా మంచిదని పంట్లాంజేబు తడుము కున్నాను. ఇంతాచేస్తే నాపర్సు నా జేబులోనే వుంది!

శ్రీ : అబ్బ! నిజంగా మీరు పర్సుపోయినట్టే చెప్పేరండీ!

పి : (గబుక్కున డాక్టరు చెంతకువచ్చి) రంగమ్మ దావా ఏమయింది?

డా : గెలిచాం! మరి అపీలు లేదు! కూర్చో!

శ్రీ : చూశారాండి, మావాడి ధోరణి?

డా : మీతో మాటాడుతూనే అతని ధోరణి కనిబెడుతున్నాను. మతిచెడి రెండేళ్ళయిందన్నారు కాదూ? ఎన్నాళ్ళయింది, హాస్పటల్‌నుంచి వచ్చి?

శ్రీ : మొన్ననే! ఏడాదికిపైగా హాస్పటల్‌లో వున్నాడు. బోలెడు డబ్బు ఖర్చయింది డాక్టరుగారూ!

పి : అరెరే! నా మగ్గులో పాలు తాగేస్తున్నాడు. ఒరే వార్డరూ! బాబ్బాబు, ఎత్తుకుపోకురా! ఆకలేస్తోందిరా; చచ్చి నీ కడుపున పుడతాను...డైనింగ్‌హాల్, టేబిల్ మీల్సు! [తింటున్నట్టు అభినయిస్తూ] ఈ నాయనమ్మ కబుర్లు నా దగ్గర చెప్పకు! సైన్సు పెరుగుతూవుంటే పొయ్యిట్రి చచ్చిపోతుందీ?

శ్రీ: వీడికోసం ఎంతడబ్బు పోశామో లెక్కలేదు. పిచ్చి లేనపుడు పుస్తకాలు; పిచ్చి కుదరడానికి కరెంటు ట్రీట్ మెంట్లు! ఇల్లు గుల్లయిపోయింది. ఎప్పటికయినా, నయమౌతుందా డాక్టరుగారూ?

పి: ఎప్పటివరకో ఎందుకు? రెండు మూడు నెలల్లో నయం చేసి ఇంటికి పంపిస్తాను.

శ్రీ: థాంక్స్! ఏదో మీ దయవల్ల నాడికా వెర్రి కుదిరితే...

డా: నా తలకు రోకలి చుడతారు కాబోలు!

శ్రీ: ధర్మమా? ఎంతమాట, ఎంతమాట! కాసులు దిగదుడుస్తాం!

డా: నా దంతా న్యూ థియరీ; సైకలాజికల్ ట్రీట్ మెంట్! ఫ్రాయిడ్, జంగ్, ఆడ్లర్ అనేకులున్నా తస్సాకు తస్సా వాళ్ళని ఫాలో కాకూడదు. నా థియరీలో ప్రకృతి, మానవుణ్ణి పలకరిస్తుంది; రోగికి చికిత్స చేస్తుంది!

శ్రీ: ఏ చికిత్సయినా, నయమౌతే చాలు!

డా: సైకాలజీని, సైన్సుని, నేచర్ని తెలుసుకున్ననాడు, ఏ చిక్కూ లేదు. చక్కని వాతావరణాన్ని పేషెంటుకి కల్పిస్తే క్యూర్ కాక ఏమౌతుంది?

శ్రీ: వెయ్యి రూపాయలే పట్టుకొచ్చాను ఫీజు.

(ఫీజు యిచ్చి లెక్కబెట్టుకోమన్నట్లు చూస్తాడు)

డా: లెక్కబెట్టుకోవడ మెందుకులెండి!

శ్రీ: మళ్లీ నాలుగయిదు రోజుల్లో తతిమ్మా లెక్క దాఖలు చేస్తాను!

డా : అంత జరూర్ లేదులెండి! కొందరు డాక్టర్లు ముద్ద ముద్దకీ బిస్లెర్లా! మనం అలాకాదు !

పి : (టెలిఫోనుతీసి తలక్రిందుగా పట్టుకుని) హాలో !

జా : అన్నన్నా...ఫోను, పాడుచేస్తున్నారు సార్ !

శ్రీ : ఒరేయ్; ఇలావస్తావా; తన్నమంటావా ?

డా : పేషెంటునలా బెదరకొట్టకండి ! హాలో ! హాలో !

పి : (డాక్టరు దగ్గరకువస్తూ) హాలోకాదు, హాలో! ఎన్ని ఎస్సేలు డిక్టేటుచేస్తే ఏం లాభం? జీరో, డబుల్‌జీరో! పోండి, వెధవ ట్యూషన్లూ మీరూను !

డా : పేషెంటుని గురించి కొన్ని ప్రశ్న లడుగుతాను. చెప్పండి ! లునసీ లేనప్పుడు అతనెలా వుండేవాడు !

శ్రీ : నార్మల్‌గా వుండేవాడు !

డా : అహాఁ ! అదికాదు ! అతని లైక్స్ అండ్ డిస్‌లైక్స్ ?

శ్రీ : చాలా చిక్కుప్రశ్న వేశారే! స్టూడెంటు డేస్ నుంచి జ్ఞాపకం చేసుకుని చెప్పమంటారా ?

డా : మీకు తోచినట్టు చెప్పండి. వాటిని నేనో ఆర్డర్లో అమర్చుకుంటాను !

శ్రీ : ఆహారంనుంచి ప్రారంభించమంటారా, విహారంనుంచి రమ్మంటారా ?

డా : ఎక్కన్నుంచి నరుక్కువచ్చినా ఫరవాలేదు ! ముందు అతని అభిమానవిషయాలు చెప్పండి !

శ్రీ : చిన్నప్పుడు పల్లెటూళ్ళో వున్నప్పుడు, ఎప్పుడూ చెట్ల మీదనే కాపరం ! తోటల్లో తిరగడమంటే, పడిచచ్చి పోయేవాడు; ఇసుక తిన్నెలమీద కూచుని, మొగలి

పెండేలవంక, ఏటిసీళ్ళవంక, ఏట్రింతలవంక చూస్తూ ఏమి శేమిటో అనేవాడు. మా వాడికి తేగలన్నా' మామిడి పళ్ళన్నా, పూతరేకులన్నా, పాలముంజలన్నా చాలా ఇష్టం. లేతకొబ్బరినీళ్ళు వాడి స్పెషాల్టీ!

డా : డైట్ కేముంది? ఏదో డైటు ఎలాగూ ఇద్దాం! మిగతావి చెప్పండి; మిగతావి !

(శ్రీ) : అతని సరదాలా ?

డా : అవును.

(శ్రీ) : జట్కా-వాడికి పావలా అద్దెకు బదులు, రూపాయి యిచ్చి చిల్లర పుచ్చుకోకపోవడం; మెయిలుకి అయిదు నిమిషాలు టైముందనగా, అడుతూ బుడుతూ తిని, ఆడుతూ పాడుతూ వెళ్ళి, ఇతన్ని చూసి అది ఆగకపోతే, టాక్సీ చేయించుకుని ఊరికి వెళ్ళడం...

డా : దర్జా! దర్జామీద పద్దు!

(శ్రీ) : నాటకాలంటే సరదా; కవిత్వంమంటే చెవి కోసుకుం...

డా : ఇక చెప్పనక్కర్లేదు! కవిత్వం నైన్ కన్నా నిషా! క్లూ దొరికిపోయింది!...ఊఁ...అతని డిస్‌లైక్స్ ?

(శ్రీ) : ఎక్కాలు, లెక్కలు, జమలు, బ్రాటోవస్లు, జనన మరణ రిజిస్ట్రారు ఆఫీసు, ఇస్త్రీ చెయ్యని బట్టలు, సాక్షి సంతకాలు, ఎలక్షను ఉపన్యాసాలు, ఏవో ఇలాంటివి...

పి : [లేచి అటు ఇటు తచ్చాడుతూ] బంతులు; పూలబంతులు! గోరువంక; నెలవంక; జాబిల్లిలో జింక ! [పద్యం] మాసిన చీర కట్టుకుని మానముతోడ నిర స్తభూషయై...

డా : (తానూ పద్యం అందుకుని) తల వాసెనకట్టుకట్టి నిడు వాలిక గస్తురి పట్టునెట్టి...

పి : (డాక్టరు కెదురుగవచ్చి) సత్యభామకు, మనమీద కోపం వచ్చిందిరా !

డా : పారిజాత పుష్పం యివ్వలేదనా ?

పి : భాగోతంలో. వేషం యివ్వలేదని!...ఏమిటా బుష్కోటు? దాన్నిండా ఎందుకా బొమ్మలు ? అది తొడుక్కుని క్లాసు కెలా వచ్చావోయ్, బడ్డూ? యూ, మిస్టర్ వెంకటపతీ! ఏమిటా చూపులు,ఆడవాళ్ల బెంచీలకేసి!...సిట్ డౌను!... డొన్ట్, స్లోగా పోనీవోయ్ !

డా : ఆయన కెలా మతి చలించిందన్నారు ?

శ్రీ : పొద్దున్న చెప్పానుగా ! నిష్కారణంగా భార్యను అనుమానించేడు !

డా : సరిసరి; జ్ఞాపకం వచ్చింది ! భార్యను పుట్టింటికి పంపిన ఎన్నాళ్ళకీ ధోరణి ?

పి : లేళ్లు జ్ఞాపకం, నెలయేళ్లు జ్ఞాపకం; కారుమొయిళ్లు జ్ఞాపకం, కాటుక కన్నులు జ్ఞాపకం! అన్నిటికన్న నీ చూపులే, పలుకులే, చిరునవ్వులే జ్ఞాపకం !

డా : ఇవన్నీ అతని కెప్పుడు జ్ఞాపకమొచ్చాయి ?

శ్రీ : మరి రెండు నెలలకి !

డా : ఆ రెండు నెలలూ, కాలేజీకి వెళ్లాడా ?

శ్రీ : ఆఁ ! వెళ్లేవాడు !

డా : పాఠాలు చెప్పేవాడా ?

శ్రీ: చెప్పేవాడు; కాని పరధ్యానంగా వుండేవాడు. క్లాసుకి రాగానే, ఎటెండెన్సు తీసుకోవడం అతనికి అలవాటు... ఒకనాడు అటెండెన్సురిజిస్టరుపట్టుకున్నాడు; తెరిచాడు... అతనిన్నేళ్లూ కాలేజిలో పొయిట్రీ చెప్పేవాడు. కాని, ఆఏడు అతనికి నాన్డిటైలు పారేశారు.

డా: హెడ్ ఆఫ్ ది డిపార్టుమెంటు ఇతనేకదూ; ఆ పొయిట్రీ ఏదో తనే వేసుకోకపోయినాడా?

పి: హెడ్డూలేదు, టెయిలూ లేదు! నరుడికన్న నారాయణుడికన్న వానరుడు నయం! కుక్కపిల్లా అగ్గిపుల్లా సబ్బుబిళ్లా అన్నీ కవితావస్తువులేనోయ్!

డా: ఊఁ!...క్లాసుకి రాగానే, మీవాడికి అటెండెన్సు తీసుకోడం అలవాటు, ఆవేళ అలవాటుప్రకారం...

శ్రీ: రిజస్టరు పట్టుకున్నాడు. దాన్ని తెరిచి స్టూడెంట్సు నేమ్సుకి బదులు, గడ గడ పొయిట్రీ చదివి, చేతులెగరేస్తూ, అర్థాలు చెబుతూ, పాడడం మొదలుపెట్టాడు! "మాస్టారూ! అది టెక్స్టు కాదండోయ్, అటెండెన్సు రిజస్టరని స్టూడెంట్సు కేకలు పెట్టేరు!

డా: అప్పుడైనా సర్దుకున్నాడా?

శ్రీ: అబ్బే! గబుక్కున క్లాసులోంచి వరండాలోకి వెళ్ళి, కామన్‌రూమ్‌దాటి పక్కనేవున్న బెల్‌దగ్గర కెళ్ళి, లాంగ్ బెల్ కొట్టేశాడు!

డా: చంపేశాడు!

శ్రీ: "ఇవాళ హాలీడే, హాలీడే! నా పుట్టినరోజు! భోగిపళ్ళు భోగిపళ్ళంటూ" అరుపులు ప్రారంభించాడు!

డా : ఆవేళందరికీ హాలీడే డిక్లేర్ చేశాడన్నమాట!

శ్రీ : ఆఁ! ఆవేళనుంచీ అతనికి ప్రతిరోజూ హాలీడేయే! అన్నంతినేవాడుకాదు; స్నానం చెయ్యమంటే కస్సుమని తాచుపాములా బుసలు కొట్టేవాడు. కనిపించిన వాణ్ణల్లా తిట్టేవాడు. "నే నెవర్ననుకున్నార్రా, ఆటోగ్రాఫ్‌లిస్తాను రండి" అంటూ వురిమి చూసేవాడు...ఒక్కొక్కప్పుడు కళ్ళనీళ్ళు పెట్టుకునేవాడు.

డా : ఆటోగ్రాఫ్ లిస్తాననేవాడా? ఐ, సీ!...అదీ ఒక కాంప్లెక్సే!

శ్రీ : ఏం కాంప్లెక్సో ఏంపాడో! వీణ్ణి తలుచుకుంటే, నాకు మాత్రం గుండె బేజారై పోతోంది. ఏదో నిక్షేపంలా యింత తిని తిరక్క, ఇదేం కాంప్లెక్సండి డాక్టరుగారూ!

డా : మీ రేం గాభరా పడకండి! ఈ ఏజ్ వుందే, దీని తల్లి కడుపుమాడ...దీని నేచరే అంత! అన్నీ కాంప్లెక్సులే! అందరికీ ఏదోఒక కాంప్లెక్స్! పొలిటీషియనూ, పొయెట్, సైంటిస్టూ, మిలియనేరూ అందరికీ ఈ ఏజ్ అంటే జడుపు పట్టుకుంది!

శ్రీ : వాళ్ళల్లో ఎవడూ కాదు మనవాడు! ఇతని కెందుకంట లేనిపోని జడుపు?

డా : అహాఁ! అలా అనకండి. వాళ్లల్లో అంతో ఇంతో పిసరంతైనా చేరకపోడు మీవాడు...అదే; అతన్ని ప్రొవోక్ చేసి సైకాలజీ శాస్త్ర స్టడీచేస్తా నుండండి!

శ్రీ : ఏంచేస్తారోమరి! మా వాడికి నయమైతే చాలు!

డా: మీ వాడికేసు డిఫికల్టీయే శ్రీనివాసరావుగారూ! ఏమంటారా, అతని దొక కాంప్లెక్సూ కాదు; ఓ లోకం కాదు. సరే, కేసు స్టడీచేసి ట్రీట్‌మెంటు ప్రారంభిద్దాం!

శ్రీ: ఎప్పట్నుంచి ప్రారంభిస్తారు డాక్టరుగారూ?

డా: రేపట్నుంచి. అందాకా అబ్జర్వేషన్‌లో పెడదాం.

శ్రీ: డబ్బుకి వెనకచూడకండి.

డా: నే ననవలసిన మాట మీ రంటున్నారు!

శ్రీ: నయమైతే చాలు. డబ్బుకేముంది, దిక్కుమాలిన డబ్బు!

డా: అది నా కొదిలిపెట్టండి. పేషెంటుని నా బ్రదరనుకుని ట్రీటుచేసి కులాసాగా యింటికి పంపిస్తాను.

శ్రీ: ఎన్నాళ్ళుపడుతుంది డాక్టరుగారూ!

డా: రెండు మూడు నెలలు; ఆ తరవాత హాయిగా మీవాడు కాలేజీకి వెళ్ళి పాఠాలు చెప్పుకోవచ్చును!

శ్రీ: థాంక్స్! ఇం పేషెంటుగా చేర్చుకుంటే ఎంతవుతుందంటారు?

డా: అలాగే చేర్చుకుందును కాని, యింకా హాస్పటల్ కన్‌స్ట్రక్షన్ ప్లానులోనే వుండిపోయింది. సైట్ ఎక్కడ తీసుకుందామా అని ఆలోచిస్తున్నాను. సీకి కొంచెం దగ్గరగా కడదామంటే, సైటు ఖరీదు బోలెడవుతుంది. ఇదేమిటండీ ఈ ఊరివాళ్ళు; కొనేవా డున్నాడుకదా అని అంత లేసి ధరలా అడుగుతారు! గజం పాతిక రూపాయలా! వీళ్ళదుంప తెగ!

శ్రీ: అయితే మావాడు ఔట్ పేషెంటుగానే వుండాలన్న మాట! మరేం లేదుకాని, నిత్యం మీ కళ్ళముందుంటే, త్వరగా క్యూరౌతుందని నా ఆశ.

డా: అలాం టిబ్బందేమీ లేదండి. పేషెంటు ఎక్కడున్నా, ఒకలాగే ట్రీటుచేస్తాం డాక్టర్లం!

శ్రీ: ఈసంగతి యిందాకా తెలిస్తే, మా కంపెనీ డైరెక్టరు మదన్‌లాల్నడిగి ఈసరికి బంగళా తాళాలు పుచ్చుకుందును. అతని బంగళా బీచిరోడ్డులో వుంది. చాలా స్పేషస్‌గా వుంటుంది కూడాను. ఈ మెయిల్లోనే కలకత్తా ప్రయాణం పెట్టుకున్నాడు. మెయిలు వెళ్ళిపోతుందో ఏమిటో!

డా: (టైముచూసి) ఇంకా పావుగంట టైము వుంది. సెవెన్ ఫిఫ్టీన్‌కి డిపార్చర్! దగ్గరే కదూ స్టేషను. ఇట్టే వెళ్ళి తాళాలు పుచ్చుకుని చక్కా రావచ్చును!

పి: (టిక్కెట్టు కలెక్టరువలె గద్దిస్తూ, డాక్టరుచెంతకువచ్చి) టిక్కెట్టు! ఏయ్ టిక్కెట్టు!...నా టిక్కెట్టు వాడిదగ్గర వుండి పోయిందిసార్! (అంటూ కుర్చీలో కూర్చుంటాడు.)

శ్రీ: (వెళ్తూ, అతని సంగతేమిటన్నట్లు చూస్తూ) మావాడు...

డా: మీవాడి టిక్కెట్టు సంగతి నేను చూసుకుంటాను కదూ! ఫరవాలేదు; త్వరగా వెళ్ళిరండి!...వాట్ ప్రొఫెసర్!

పి: (తన ధోరణిలో) పళ్ళు! దానిమ్మపళ్ళు! దబ్బపండు ఛాయలే! నిగనిగలాడుతూ, ఎన్ని నేరేడుపళ్ళో! టప టప నీళ్ళల్లో జారిపడుతున్నాయి, పండుటాకులు! పాల పిట్టలు; పావురాలజంట! నీడలు పరుచుకుని గూళ్ళకు

వెళుతున్నాయ్. లేళ్లు, సెలపళ్లు! జ్యోతులు, జ్యోతుల్లాంటి కళ్ళు!

[శ్రీనివాసరావు వెడుతూవుంటే. ప్రవేశం: ఛాయ; ఇరువురూ ఒకరినొకరు చూసుకుంటారు. శ్రీనివాసరావు రెండడుగులు వెనక్కి తగ్గుతాడు; ఛాయ గబగబ ముందుకు తొలగిపోతుంది. పిచ్చివాణ్ణి చూసి కళవళ పడుతుంది. భయంభయంగా అతనివంక చూస్తుంది. బాధతో లోపలకు వెళ్ళిపోతుంది. శ్రీనివాసరావు, ఆమె కళవళపాటునుచూసి నిట్టూర్చి బయటకు వెడతాడు. పేషెంటుని చూస్తూ, డాక్టరు యిదేమీ గమనించడు.]

డా: ఏమిటి ప్రొఫెసరుగారూ! ఇది కవితాగోష్ఠి కాదండోయ్; మెంటల్ హాస్పటల్!

పి: ప్రొఫెసర్ కోడిరామ్మూర్తి చేప కడుపుకోసి, ఉంగరం దుష్యంతుడికి ఇవ్వకపోతే, కాళిదాసు శకుంతల సూయిసైడు కమిట్ చేసుకునేది!

డా: నువ్వు పోస్టుమార్టమ్ చేసేవాడివి!...ఆట్టే విసిగించక కూచో! సర్కస్ ఫీట్లూ, కవిత్వం కలిపేస్తూంటే నే నెలా చచ్చేది!

పి: కశ్చిత్ కాన్తా విరహగురుణా...

జా: ఇదేమిటండోయ్, తద్దినమంత్రాలు చదువుతున్నారు?

డా: అచ్చాణీలాంటి పేషెంటురా! ఎన్ని జన్మలెత్తినా ఇలాంటివాడు దొరకడం మహాకష్టం!

జా: అసలు ఆయనకి నయమాతుందంటారా అయ్యగారూ!

డా: నయమో గియమో; మన కెందుకు? వాడిలోకం వేరు; మన లోకం వేరు! శ్రీనివాసరావు, డర్టీ ఫెలో! ఇప్పుడే వస్తానని యీ క్రేక్ ని మన కప్పగించిపోయాడు. ఆ దత్తా

త్రేయుడు చెప్పినట్టు, వీణ్ణి, మన ఛెయిర్‌కి తక్షకుడిలా చుట్టుకున్నాడు. వాడు రాగానే వీణ్ణి పేకాఫ్!... ఇదిగో, యీ వెయ్యీ సరిగ్గా వున్నాయో, లేదో లెక్క పెట్టు. (నోట్లు యివ్వబోతాడు' జాన్ పుచ్చుకుందుకు సంశ యిస్తాడు.)

జా: బజార్నుంచి అమ్మగారొచ్చారండి! ఏం కొన్నారో చూసొస్తాను!

డా: అమ్మగారొచ్చారా?

జా: ఇందాకనే వచ్చారండి! లోపలున్నారు!

డా: అరెరె! చెప్పేవుకావేం? ... ఛాయా! ఛాయా! మోస్టు లవ్‌లీ బర్డ్! ఈ ఫ్లారెన్స్ నైటింగేల్‌కి పేదలన్నా పేషెంట్లన్నా పిటీ!... వీణ్ణి, కొంచెం కంట్రోల్ చేస్తూండరా! ఇప్పుడే వస్తాను! (లోపలకు వెళ్ళబోతాడు)

పి: మళ్ళీ వార్డర్నెందుకు పిలుస్తార్రా బాబూ! కొడతాడు కాబోలు! (వీధివైపు పారిపోబోతాడు)

జా: పారిపోతున్నారు, బాబూ! పారిపోతున్నారు.

డా: (వెనక్కి తిరిగిచూసి, పిచ్చివాడికి అడ్డంతగిలి) యూ, మిస్టర్! వెనక్కిపద! ఎక్కడికి వెడుతున్నావ్?

పి: (తిరిగివచ్చి) అంతా వెళ్ళిపోవలసిన వాళ్ళమే!

డా: నువ్వూ వెళ్ళిపోదువుగాని! కాసేపు కూచో!

పి: ఉండు, ఉండు!...నువ్వయినా, చెప్పరా, లక్ష్మణా! సీతమ్మతల్లీ! నువ్వయినా చెప్పవే!...ఎవరబ్బాసొమ్మని కులుకుతూవున్నావు, రామచంద్రా! (పాడుతూ పద్మాసనం వేసి కుర్చీలో కూర్చుంటాడు)

డా: (ఆ పాటను తానూ అందుకుని) సేతమ్మకూ చేయిస్తీ, చింతాకూ పతాకమూ, రామచంద్రా!

పి: దా! దా! నువ్వయినా కూచోరా, బాబూ!

డా: (కూర్చుని) రామదాసు కులాసాగా వున్నాడా?

పి: వాడికేం; పూలరంగడు! రామ లక్ష్మణులు రశీదిచ్చే సేరుగా!

డా: నీకేం; నువ్వూ పూలరంగడివే! నీకు అప్పులే లేవు!

పి: మరి, నన్నెందుకు వాళ్ళు కొట్టేరు?

డా: వాళ్ళందర్నీ జైలులో వేయించాన్లే!

పి: మంచిపని చేశావురా; రా, రా! మా నాన్న! నామీద అలా రాస్తారా; గోడలమీద బొమ్మలు! గుసగుసలు!

డా: పిచ్చివాళ్ళతో మనకేంపని? పోనిద్దూ!

పి: (కోపంగా) నాకా పిచ్చి? యూ...

డా: నీక్కాదు; నీమీద గుసగుసలాడారే; వాళ్ళకే పిచ్చి!

పి: అదీమాట! మా బాగా చెప్పేవ్! యూ ఆర్ ఎ వెరీగుడ్ స్టూడెంటు! నాకథ చదివేవ్రటా?

డా: చదివాను!

పి: ఎలావుంది?

డా: చాలా బాగుంది! పత్రికలన్నీ ఒక్క కాపీ లేకుండా చెల్లిపోయాయ్!

పి: అది నేను రాయలేదంటారేం; అన్యాయం!

డా. వాళ్లు రాయలేక!... మహాకవుల కీపాట్లు తప్పవులే! గురజాడ అప్పారావు ననలేదూ? షేక్స్పియర్ ననలేదూ?

పి: అయితే, నేనూ మహాకవినే నన్నమాట!

డా: అందు కభ్యంతర మేమిటి!

పి: మరి, నోబుల్ ప్రెయిజో?

డా: ఈసారి నీదేలే!

పి: నువ్వొక్కసారి వాళ్ళకి రికమెండ్ చేద్దూ!

డా: తప్పకుండా!

పి: (ధోరణి మార్చి, తెమ్మని చేతులూపుతూ) ఓ పదిరూపాయ లుంటే యిద్దూ!

డా: (తెల్లబోయి, తేరుకొని) నా దగ్గర లేందే!

పి: (భార్యను ఊహించుకుని) లేదంటా వేమిటే! నిన్న నేకదూ యిచ్చాను! పెట్టెలో చీరమడతల్లో దాచుకుని వుంటావ్! పోనీ గదులపెట్టె వెదుకుదూ, అదే వుంటుందీ!... బట్టలపెట్టెలో మొగలిరేకులు పెట్టుకుంటే ఎంత బావుంటుంది!

డా: తెమ్మని ఎన్నిసార్లు చెప్పినా, మీకు మతిమరుపే ఇదిగో తెస్తామంటారు; ఇట్టే మర్చిపోతారు! గుమ్మం కదిలితే, ఇల్లూ వాకిలీ మీకు జ్ఞాపకం వుంటేకదూ!

పి: (దగ్గరకు వెడుతూ) ఒసేయ్!

డా: (దూరంగా తొలగి) ఒసేయ్, ఒసేయ్, అసహ్యం! పే పెట్టి పిలవలేరా ఏమిటి?

పి: మా అమ్మవుకదు; తల్లీ తల్లీ! చప్పున వంటచెయ్యి! అదిగో, బెల్కొట్టేశారు...ఉండండర్రా, బాబూ! వచ్చేస్తున్నాను. అప్పుడే ఫస్టుబెల్లా?...ఇంకా వంటాలేదు; పెంటాలేదు. చెబితే వినవ్; అదిలేదిదిలేదని సాధింపుతూ నువ్వూను!

డా: వంటయ్యే పోయింది! దబ్బకాయ పొంగించాను; బంగాళాదుంపలు వేయించాను. ఇగురు పచ్చడి చేశాను. ఆవకాయ వుండనే వుంది. పాలోళీ, మజ్జిగ, పులుసు, అప్పడం, వడియం...చాలవా ఏమిటీ ?

పి: ఏమిటే, ఆ చీర, అసహ్యాం! వెలవెలబోతోంది రంగు! బోలెడన్ని చీరలు కొన్నాను; బీరువాలోంచి తీయనే తీయవ్! ఆ రోజాకలర్ శారీ కట్టుకురద్దూ; సినీమాకి వెళదాం!

డా: వెళదాం! ఎంతో బాగుందిట! వాళ్ళ జయలక్ష్మీ మీనాక్షీ అంతా నిన్ననే వెళ్ళారు!

పి: ఎవరు రాశారీ ఉత్తరం? ప్రేమలేఖలు రాస్తోంది, ప్రేమలేఖలు!...ఆఁ! నీకేం తెలియదు! సంగనాచివి బయలు దేరావ్! నన్నే మోసగిస్తావా ?

డా: ఒట్టండీ. నామాట నమ్మండీ...నేనేం...

పి: మంచీ చెడ్డా, మర్యాదా మప్పితం, సిగ్గూఎగ్గూ లేకపోతే సరి! కిట్టనివాళ్ళు రాశార్ట, కిట్టనివాళ్ళు!

డా: (తన సహజధోరణిలో) ఎందుకయ్యా, నీకీ లేనిపోని అనుమానాలు? తాడునుచూసి పామనుకుంటావ్, నిక్షేపంలా వుండక?

పి: అంతేనంటావా?

డా: కాక?...అలా కుర్చీలో కూచో! అటుచూడు, ఆకాశం నైపు! అప్పుడే తలంటుకుని ఆరబోసుకుంటున్న ప్రేయసి జుత్తులా మబ్బులు!

పి : (కుర్చీలో కూర్చుని అటు చూస్తూ) "ఆమె కన్నులలో ననంతాంబరంపు నీలినీడలు కలవు...ఇరుల గుసగుసల్ వానిలో నిపుడు నపుడు వినబడుచునుండు...మరికొన్ని వేళలందు, వానకారు మబ్బుల మెయివన్నె వెనుక దాగు బాష్పమ్ము లామె నేత్రములలోన బొంచుచుండును!"

[అతను, కలకంటున్నట్టు మెల్లిగా పాడుకుంటూ కూర్చుంటాడు. డాక్టరు, డ్రాయరు తెరచి తన లెటరుపేడ్ తీసి, అతని కందిస్తాడు; జేబులోవున్న పెన్ తీసి చేతికిస్తాడు. అవి అతను తీసుకుని ఏదో వ్రాసుకుందుకు ఆలోచిస్తాడు. డాక్టర్ కాస్త తేరుకుని, సిగరెట్టు ముట్టించి, రెండురింగుల పొగ వొదులుతాడు. అవతలనుంచి తొందర తొందరగా దత్తాత్రేయుడు చేత్తో బెడ్డింగు, గొడుగూ పట్టుకుని ప్రవేశిస్తాడు.]

దత్తా : డాక్టరుగారూ! డాక్టరుగారూ! ఇంకా తమరు యిక్కడే కూర్చున్నారా? జనతా అరగంట లేటు; బయల్దేరండి సార్! అప్పుడే నా జూనియర్...

డా : (ఉలిక్కిపడి) ష్! (వ్రాసుకుంటున్నాని దృష్టి చెవరగొట్ట వద్దని సౌజ్ఞచేస్తాడు.)

ద : (మెల్లిగా) ఎవరండీ వారు?

డా : (ఇంకా మెల్లిగా) వారో కాలేజీ ప్రొఫెసర్! కవి; స్పీకరు; మోస్టు ఇన్ ఫ్లుయన్షల్! డాక్టరేట్లు పుచ్చుకుంటున్న మహా నాయకులకి స్నాతకోపన్యాసాలు వ్రాస్తూవుంటారు!

ద : అబ్బ! అంత పలుకుబడే!...

డా : మీ ఇష్టమొచ్చిన వృత్తంలో పద్యం చెబుతారు; అట్నుంచి చదివితే ఓ అర్థం, ఇట్నుంచయితే ఇంకో అర్థం, మధ్యనుంచి చదివితే మరొక అర్థం...కాని ఏం లాభం? మూడ్ వస్తేనేగాని కలం పట్టుకోడు! ఈ

పరిషత్తుకైనా ఓ నాటకం రాసివ్వండంటే, యిదిగో అదిగోఅని అయిదేళ్ళనుంచి పోస్టుపోన్ చేస్తున్నాడు. ఏదో ఇన్నాళ్ళకు భార్య పుట్టింటికి వెళ్ళిందీ, ఆయనకా మూడ్ కాస్తా చక్కానచ్చింది. ఇక్కడ కూచోబెట్టి నాటకం రాయిస్తున్నాను. మీరిప్పుడేం డిస్ట్రిబ్ చేయకండి!

ద: నా జూనియర్, ప్రయాణ సన్నాహంలో వున్నాడని ఇన్ఫర్మేషనొచ్చింది. ఇక లాభంలేదని, నేనూ ఎకాఎకి స్టేషనుకి బయలుదేరాను. టైము లేదు. బయలుదేరండి!

డా: హుటాహుటీ మనమూ బయల్దేరదాం. మీరిక్కడ వుండండి! నేనిప్పుడే వస్తాను!

ద: థాంక్స్యూ, థాంక్స్యూ!

డా: ఆయన నాటకం రాసుకుంటున్నాడు. గొప్ప ఎమోషన్లో వున్నాడు. డిస్ట్రిబ్ అయితేమాత్రం, నే నొచ్చేదాకా ఆయన్ని ఎంగేజ్ చేస్తూ వుండండి!

(అంటూ వెళ్ళిపోతాడు)

ద: కవుల ఎమోషన్స్ నాకు తెలుసులెండి! ఏమిటి రాస్తున్నారో, ఏమిటి తింటున్నారో, ఏమిటి మాట్లాడుతున్నారో, వాళ్ళకే తెలియదు! సత్రవు భోజనం! మఠం నిద్ర!

పి: (వ్రాసుకుంటూ, ఒక్కసారి తలఎత్తి అతనివంక చూస్తాడు.)

ద: ఏమిటి తమరలాగ తేరిపార జూస్తున్నారు! నే నెవర్ననా?

(విజిటింగ్ కార్డు యిస్తాడు)

పి: (చదివి, క్రిందపారవేసి) ఎవ్వాతవీవు భీతహారిణేక్షణా...

ద : ఏం పసందైన పద్యం రాసేడండీ, ముండాకొడుకు!. ద్రాక్షగుత్తిలాంటి పద్యం; దూసుకు తినొచ్చు! ఆ 'భీత హారిణేక్షణ' అనడంలోనేవుంది సొగసంతా...మహా కవులు, మీకు తెలియని దేముంది; మీకు చెప్పడానికి మే మెంత? బి. ఏ., యల్టీలం! తమరు యం. ఏ. లని విన్నానూ; ఏ కాలేజీ లెక్చరర్లు; తమ స్కేలెంత? మా యల్టీలకన్న, బి. ఇడీ. ల కన్న మీ యం. ఏ. లు అదృష్ట వంతులు! నాగపూర్ యం. ఏ. కి నేనూ వెళదా మను కుంటున్నాను; ఛాన్సు వుంటుందంటారా?

పి : ఏమిటా గోల! చెవి దగ్గర రొదరొద! మమ్మల్నిచూసి అంతా అసూయ పడేవాళ్ళే!

ద : నే నెవరిమీదా అసూయపడే రకం కాదు, మహాను భావా! అందులోనూ తమవంటి పలుకుబడిగల స్నేహితు లతో నా కెందుకు పోటీ? ఏదో మాటవరస కన్నాను. నా ధోరణే అంత!

పి : నీ ధోరణే నీదా? నిజం నిప్పులాంటిది. నువ్వు దాచినా దాగదు. ఉన్నది ఉన్నట్టూ చెప్పావా, నిన్ను అందలం మీద కూచోబెడతాను!

ద : నా సంగతి మీకు డాక్టరుగారు చెప్పేవుంటారు; నే నలాగ అబద్ధమాడవలసినవాణ్ణికాను. నేను పనికిరాననీ, నాకు డిసిప్లిన్ మెయింటైన్ చెయ్యడం రాదనీ, కోర్సులు సరిగ్గా కంప్లీటు చెయ్యననీ, అదనీ యిదనీ నానా కూతలూ కూశాడు! నానా రాతలూ రాయించాడు! ఆకాశ రామన్న ఉత్తరాలూ, మహజర్లమీద మహజర్లూ ఆఫీ

సులుమీద ఏకటాకీగా కురిపించాడు! చివరకి చెదపురుగులు తిన్నట్టు నా రికార్డులే తినేశాడు! ...మీకు మంచి ఇన్‌ఫ్లుయన్సు వుందని విన్నాను; ఓ రికమెండేషన్ లెటరిస్తే హైద్రాబాద్ పట్టుకుపోతాను ... మీ కవిత్వానికి అడ్డు వచ్చానని మరోకలా అనుకోకండి!

పి: రామాపురంలో ఓ మేక కడుపున పెద్దపులి పుట్టింది; కాషాయిగుడ్డలు కట్టుకొని గెడ్డంపెంచి పెద్దపులి చెట్టు కింద కూర్చుంది.

ద: మీరలాగ బ్రహ్మంగారి పదాలుపాడితే ఆ గూఢార్థాలు నా కర్థమౌతాయా? నాకు కవిత్వాలూ, వాటి పోకలూ తెలుస్తాయా? తమర్ని నేనడిగింది ఒక్క లెటర్!

పి: పూటకి శేరు పాలిచ్చే ఆవుంటే మనకి సరిపోతుందనుకుంటాను. ఏమంటావ్? మాట్లాడవేం?

ద: తమరు హాస్యానికంటున్నారా? నిజంగానే అడుగుతున్నారా? నేనొకటి మాట్లాడుతూంటే తమరొకటి మాట్లాడుతున్నారు! మేకలనీ, పెద్దపులులనీ, లేళ్లనీ, ఆవులనీ తికమకలుగా చెబుతున్నారు. తమకంటే బుద్ధిలో కాకపోయినా వయస్సులో అంతో యింతో పెద్దవాణ్ణి! పెద్దవాళ్లతో పరాశకం సబబుకాదు.

పి: పటప్! ఇవాళ నీకూ నాకూ ఎంతేనావుంది. నించున్న పళంగా యింట్లోంచి గెంటించేస్తాను.

ద: ఏమిటి పేలుతున్నావ్! పటప్పా! మళ్ళీఅను ఆమాట! ఇంట్లోంచి గెంటించేస్తావేం? ఇది నీ తాతగారు కట్టించిన యిల్లులాగ! అబ్బోరిబాబు! ధాంధూం అంటున్నాడు!

పి: నేనే పోతాను! నువ్వేవుండు. వుట్టికట్టుకొని వూరేగవే తల్లీ!

[ఛటాల్న బెడ్డింగుపట్టుకొని అవతలకు పోబోతాడు. వస్తా్రేయుడు అడ్డంవెళ్ళి బెడ్డింగు గుంజుతాడు. ఒక నిమిషం అరుపులు; పిచ్చివాడు అతనిచెయ్యి కరుస్తాడు. వస్తా్రేయుడు ఓ గుద్దు గుద్దుతాడు.]

ద: నీ కవిత్వం సంగతేదో నువ్వు చూసుకోక నా బెడ్డింగు చంకని పెట్టుకొని వుడాయించా లనుకుంటున్నావా? ఏదో తగుమనిషి వనుకుని యింతసేపూ మర్యాదగా మాట్లాడేను. అంత ఆసామాషీగా వుందేం నాతో వ్యవహారం? నేనేం పిచ్చిపుల్లయ్య ననుకుంటున్నావా?

పి: (కుర్చీలో కూలబడి దీనంగా) ఒరే వార్డరూ! కొట్టకురా బాబూ!

జా: (అరుపులువిని లోపలినుంచివచ్చి) ఆయనతో ఏమిటి బాబూ! మతిస్థిరంలేనిమనిషి!

ద: (గతుక్కుమని) ఆఁ! ఆ సంగతి తెలిస్తే యింత అల్లరి పడకపోదును! అతనిమీద కలియబడక పోదును; ఒరే అబ్బాయీ, మాట! ఓ చిన్నమాట! డాక్టరుగారు ప్రయాణ సన్నాహంలో వున్నారా, లేదా? ఆ మాటే మర్చిపోయి అమ్మగారితో బాతాఖానీకి దిగారా? నువ్వోకసారి మేడమీదకు వెళ్లి రైలుకి టైమైపోయిందని చెప్పిరద్దూ బాబూ!

జా: మేడమీదకు యిప్పుడు వెళ్ళడం నావశమాండి? అయ్యగారు చాలా కోపంగా వున్నారు!

ద : అయ్యగారి కోపం ఎంతసేపుంటుందిలే! ఆలు మగల దెబ్బలాట అద్దంమీది పెసరగింజ లాంటిది!

జా : ఏమైనా యిప్పుడు మాత్రం లాభంలేదండి!

ద : అన్నా! నన్ను గట్టిచిక్కుల్లో పెట్టేశారే! యీ పిచ్చివాడికీ నాకూ యిక్కడ తగువుపెట్టి ఆయన వెళ్లి అక్కడ తగువుల్లో చిక్కుకుంటే ఏం దారి? రైలుకూడా దాటి పోతోంది. సరే; ఏం చేస్తాం! ఇంతసేపూ నేను కూచుని కూచుని యిప్పుడే వెళ్ళేనని ఆయనకి కోపం తగ్గేక చెప్పు! పొద్దున్న మెయిల్‌లో ప్రయాణం! రెడీగా వుండమను! అది తప్పితే సాయంకాలం జనతా వరకూ యింకో బండీ లేదు. మెయిలుకు ఖాయం అని చెప్పూ (వెళ్ళిపోతాడు).

పి : (టేబిల్ మీదవున్న పూలగుత్తె తీసి గులాబీని చూస్తూ)

"నా విరులదోటఁ బెంచి కొన్నాడ నొక్క
పవడపు గులాబి మొక్క నా ప్రణయ జీవ
నమ్ము వర్షమ్ముగా ననయమ్ము గురిసి;
కొన్నినాళ్ళాయె, సుకుమార కుసుమ మొకటి
నవ్వె కల కల మని నా వనమ్ములోన;
అంత దానినె, నా జీవితాశయమ్ము
పూవుగా వింతగా మారిపోయినటులు
వలచి కొన్నాడ;
నా ప్రసవమ్ము నేను,
నన్ను మనసార నా ప్రసూనమ్ము, కనులు
విచ్చి కాంచుచుఁ గాలము పుచ్చినాము

ఎదల నిశ్శబ్దముగఁ బల్కరించుకొనుచు;
ఎట్టు లదిదాపురించెనో యేమొ యంత
నాకు సందులత్రోవల నల్ల దిగియె
నొక్క క్రూరార్క కిరణమ్ము, ఉర్వి వాలి
నా గులాబి సోలి తూలి నన్ను వీడె,..."

డా: (కోపంగా మేడమెట్లు దిగుతూ) జీవితమంటే, ఫౌంటెన్లో రంగు రంగుల చేపల్నిచూస్తూ కూర్చోవడం కాదట! మరి? రోగుల గాయాలుచూస్తూ, ఏడుస్తూ కూర్చోవడమా! జాన్! ఆ దత్తాత్రేయుణ్ణి పంపించేశావ్ కదూ?

జా: రేపొస్తానని చెప్పమన్నారు!

డా: (పిచ్చివాణ్ణి చూసి) వీడెందు కిక్కడ? ఈ పిచ్చిముండా కొడుకు!

జా: శ్రీనివాసరావుగారింకా రాలేదు... (లోపలకు వెళ్తూ) అమ్మగారు మధ్యాహ్నం భోజనం చేయలేదు!

డా: భోజనం ఎందుకు? సత్యం, ధర్మం, న్యాయం, మానవ సేవ, వసుధైక కుటుంబం యీ ఆదర్శాలు చెప్పేవాళ్ళకి ఎందుకు ఆకలి వేస్తుందిలే! ఆ ఆదర్శాలనే భోంచేస్తారు!

ఛా: (మేడమెట్లు దిగివస్తూ) డాక్టర్!

డా: చాలు! ఇంతసేపూ నువ్వు చెప్పిన ధర్మోపన్యాసాలిక కట్టిపెట్టు! ఈ ఆదర్శాలన్నీ మంచుకొండలు!

ఛా: కావు; అవి గౌరీ శిఖరాలు!

డా: అలా అనుకునే, ఆ గౌరీశిఖరాలను అధిరోహించడానికి ఉన్మాదులు బయలుదేరతారు. అధిరోహించే ముందు

కొందరు కాళ్ళు విరగకొట్టుకుంటారు. మరికొందరు మధ్య మార్గంలో మరణిస్తారు !

ఛా: కాని ఆ గౌరీశిఖరాలను చూసిమాత్రం నీలాగ ఎవరూ పరిహసించరు డాక్టర్ !

డా: ఎందుకు పరిహసిస్తారు ? వాళ్లు గడుసువాళ్లు ! తాము మాత్రం దూరంగావుంటూ వాటిని అందుకోబోయే నిన్నూ నన్నూ చూసి పరిహసిస్తారు !

ఛా: నువ్వూ నేనూ అందరికీ ఆదర్శవంతంగా బ్రతకనక్కర లేదు, కనీసం మానవులుగా జీవించా లంటున్నాను.

డా: నువ్వు ఎలా జీవించావో నాకు తెలియదు ఛాయా ! నేను మాత్రం ...

ఛా: దత్తాత్రేయుణ్ణి మోసగించి...

డా: నేనేం మోసగించాను ? అతని వుద్యోగం అతని కీయకుండా అంతా అన్యాయం చేశారు. ఆ అన్యాయాన్ని నే నెదిరించదల్చుకున్నాను !

ఛా: అందుకా వెయ్యిరూపాయలు...

డా: నేను తిందామని పుచ్చుకున్నానా ? నాతో అతనూ వస్తాడు. అక్కడ మరెంత ఖర్చవుతుందో తనకళ్ళతో తానే చూస్తాడు !

ఛా: ప్రకాశరావు దగ్గర పుచ్చుకున్న పదివేల రూపాయలు ?

డా: ఫ్యాక్టరీమీద ఫ్యాక్టరీ కడదామనుకున్నాడు; గడించిన లక్షలు చాలవనుకున్నాడు; కోటికి పడగలెత్తాలనుకున్నాడు ! నా కోసం యిచ్చాడా ? అది నావొళ్లో పడుతుందనుకున్నావా ?

ఛా: హుఁ! డాక్టర్! తమ్ముడికి పిచ్చి కుదర్చనని పొద్దున్నే అతని అన్నదగ్గర పుచ్చుకున్న...

డా: ఆ డబ్బు అప్పుడే వాడికి పంపివేశాను!

ఛా: ఎందుకీ అబద్ధాలు? ఎవర్ని మోసగించాలని?

డా: ఎందుకు నీకీ ప్రశ్నలు?

ఛా: ఇది నీ ఒక్కడి జీవితానికే సంబంధించిన విషయం కాదు! మానవ జీవితాలను పేకముక్కలుగా కలిపి ఆట లాడుకుందుకు, ప్రపంచం ఒక క్లబ్బ అనుకుంటున్నావా?

డా: లేదు; హాస్పటలుకు వచ్చే రోగులను డ్రసింగ్ చేసి పార వేసిన దూదికంటె కనికిష్టంగా భావించి వాళ్ల ప్రాణాలతో జూదమాడే హాస్పటల్ వార్డనుకుంటున్నాను ఛాయా!

ఛా: హుఁ! హాస్పటలులోవున్న రోజుల్లో ఒక రోజు, ఒక పూట, ఒక గంట, ఒక నిముషం, యిప్పుడైనా జ్ఞాపకం తెచ్చుకో డాక్టర్!

డా: నే నెందుకు జ్ఞాపకం తెచ్చుకోవాలి? ప్రభుత్వం హాస్ప టలు అందుకే కట్టింది. మీకు జీతాలిస్తోంది. జీతాలు పుచ్చుకునేవాళ్ళు సర్వీచెయ్యక ఏంచేస్తారు! దీనిలో ఏం త్యాగం వుందని నువ్వు నన్ను మురిపిస్తున్నావ్?

ఛా: నేనేం నిన్ను మురిపించలేదు, డాక్టర్! నువ్వే నన్ను మురిపించి నే నెవరినో నాకే తెలియకుండా మరిపించావ్! నీ మాటలతో నన్ను మంత్రించావు! "నువ్వు నా అందాల దేవతవన్నావ్! నిన్ను ప్రేమించాననన్నావ్! నువ్వులేని ఒకక్షణం ఒకయుగమన్నావ్! ఏ వేవో ఆదర్శాలన్నావ్! ఉత్తమ ఆదర్శాలకోసం మన జీవితాలను త్యాగంచెయ్యా

లన్నావ్! నువ్వు నర్సుగా, నేను డాక్టరుగా సమాజానికి సేవచేద్దాం" అన్నావు! నా మనోదౌర్బల్యం నాకే తెలిసిందికాదు! ఏ యింద్రియ లోలత్వాన్నయితే యింత వరకూ అణుచుకుంటూ వచ్చానో ఆ యింద్రియ చాపల్యమే, నా మెడకు ఉరిత్రాడు బిగించింది!

డా: పాపం! నా యింద్రియ చాపల్యంతో నేనే నా స్వప్న దేవతకోసం అన్వేషిస్తూ వచ్చేను! అందుకే యీరోల్సు కార్లూ, పాలరాతి భవనాలూ నాకోసమే...

ఛా: నా కోసం నీ శ్రమ అక్కరలేదు, డాక్టర్! రోల్సు కారునుచూసి పుష్పక విమానంగా, పాలరాతి భవనాలను దేవాలయాలుగా భ్రాంతిపడి వాటిచుట్టూ ప్రదక్షిణ చేసే అబలనుకాను.

డా: నీలాంటి అబలల సంగతి నాకూ తెలుసును! ఏదో హాస్పటలులో అనాథగాపడిఉన్న నిన్ను, పోనీకదాఅని, జాలిపడి ఆశ్రయ మిచ్చాను. మామూలు స్త్రీనికాదు; ఒక వితంతువును ఉద్ధరించానని యింతవరకు ఉబలాటపడ్డాను.

ఛా: నేను నీ దయాధర్మ భిక్షకోసం, నీమీద ఆధారపడ్డానికి రాలేదు. భార్యాభర్తలంగా మనం యిద్దరం సరిసమానంగా జీవిద్దామని నన్ను మభ్యపెట్టేవ్!

డా: ఏమిటి నీకా అహంకారం? ఎవరిచ్చారు నీకీ అధికారం? నే నిపుడు నిన్నాదరించకపోతే, సమాజం దృష్టిలో నువ్వేమౌతావ్?

ఛా: అదా, నీ బెదిరింపు?

డా: నిన్ను బెదిరించవలసిన అవసరం నాకేముంది? నిన్ను సమాజమే బెదిరించింది!

ఛా: నీకు దయాదాక్షిణ్యం లేకపోతే పోనీ, కనీసం పాపభీతి కూడా లేదు. ఉంటే యిలా మానవుల ప్రాణాలతో చెలగాట మాడతావా?

డా: ఛాయా! నువ్వొక ఆడదానివని మర్చిపోకు!

పి: భవభూతి ఉత్తరరామ చరిత్ర మహా బాగుంటుంది!... ఒరే చాకలీ! నా బట్టలెందుకురా మ్మారుగిల్లు చేశావు? నాలుగు పంట్లాములూ, పది పంచెలూ, పద్ధుప్రకారం సరిగ్గా తేవాలని తెలియదూ? డర్టీ ఫెలో! (అంటూ డాక్టరు చెంతకు వెళతాడు. డాక్టరు కోపంగా అతన్ని తోసివేస్తాడు. అతను తూలి క్రింద పడబోతాడు డాక్టరు అతనిమీదకు వెళ్ళబోతాడు. ఛాయ అడ్డం వెళుతుంది.)

డా: నీ తిక్క వదులుస్తా నుండు; మేడ్ కేప్! (అడ్డంగా నించున్న ఛాయను నెట్టేస్తూ) ముందు నువ్వవతలికి పద! వీడి బుర్ర రామకీర్తన పాడిస్తాను! (పిచ్చివానిమీదకు దూకుడుగా వెళ్ళబోతూ వుంటాడు.)

ఛా: ఆగు! ఆగు డాక్టర్! ఆగు!

డా: నువ్వా నన్నాగమని గద్దించేదానివి?

ఛా: అవును! నేనే!

డా: జాన్! జాన్!

జా: (లోపల్నుంచి వస్తూ) ఏమండీ నార్!

డా: ఆ కొరడా ఇలా పట్టుకురా! వెళ్ళు! ఊఁ!

ఛా: జాన్! ఆగు! ఎక్కడికి?

డా: కదలవేంరా? (మీదకువచ్చి, జాన్‌ను ఒకగుద్దు గుద్దుతాడు.)

జా : మా అయ్యో నన్ను కొట్టలేదండి ! మీరు చెయ్యి చేసుకొన్నారు !

డా : గెటవుట్ ! ఫూల్ !

[జాన్ వీధిలోకి పారిపోతాడు. డాక్టరు లోపలకివెళ్లి కొరడా పట్టుకుని వస్తాడు. పిచ్చివానిమీదకు అగ్గిరుద్రుడై విరుచుకు పడబోతాడు.)

ఛా : (డాక్టరును అడ్డగిస్తూ) ఈ అకృత్యాలిక కట్టిపెట్టు డాక్టర్ !

పి : కృతిసమర్పణోత్సవం ! కృత్యాద్యవస్థ !

డా : సమర్పిస్తాను సమర్పిస్తాను ! (పిచ్చివానిమీదకు వెళతాడు. అతను డాక్టరుకి దొరకక, అటు ఇటూ తిరుగుతాడు.)

ఛా : ఆగు ! అత నెవరనుకొన్నావ్ ?

డా : ఎవరు ?

ఛా : నా పేషెంటు ! ఆగు !

డా : కాదు; పద; బయటకిపద !

ఛా : ఆగు ! ఆయన ఎవరనుకుని మీదకు వెడుతున్నావ్ !

డా : ఎవరు ?

ఛా : నా భర్త !

డా : నీ భర్తా ?...వీడా వీడు ! వీడు నీ భర్తా ?

ఛా : అవును !

డా : నీ భర్త లేడనిచెప్పి నన్నెందుకు మభ్యపెట్టావ్ ?

ఛా : నిన్ను నే నెప్పుడూ మభ్యపెట్టలేదు ! నువ్వే అలా అనుకున్నావ్ !

డా : వాళ్లను మభ్యపెట్టి హాస్పటల్లో ఎందుకు చేరావు ?

ఛా : ఆ పరిస్థితులు ఎవరికీ అర్థంకావు; నిన్ను మభ్యపెట్టనపుడు ఆ ప్రశ్న నీ కనవసరం !

డా: ఎంత మోసం! ఎంత వంచన! అతన్నే కాదు; నన్నూ మోసగించేవు! స్వేచ్ఛ యిచ్చాడుకదాని, దాన్ని దుర్వినియోగంచేసి అప్పుడు అతన్ని అన్యాయం చేశావు; ఉన్మాదిని చేశావ్; ఇప్పుడు నన్ను...

ఛా: నే నెవరినీ మోసం చెయ్యలేదు; అప్పుడు ఆయన నన్ను అర్థంచేసుకోలేదు; ఇప్పుడు నేను నిన్ను అర్థంచేసుకోలేదు. ఎవరు ఎవరిని అర్థంచేసుకోక పోయినా చివరికి మోసపోయింది నేను! ఒకప్పుడు ఆయన, నన్ను తన జీవిత సర్వస్వంగా భావించేరు. నా జీవితమంతా అలాగే ఆ వెన్నెల బాటలమీాద పయనిస్తుందని కలలుగన్నాను. అందుకు నోచుకోని, నిర్భాగ్యురాలను! ఆ మాటలు నమ్మవద్దన్నాను; పట్టిపుకార్లు, కిట్టనివాళ్ళ మాటలు!... అవే నిజం అనుకున్నారు. నా మాటలు విన్నారుకాదు; నన్ననుమానించేరు. ఈ వుత్తరాలు ఎవరు రాశేరని ఏవేవో ఉత్తరాలు పట్టుకు వొచ్చేరు. నాకేం తెలియదన్నాను. అనుమానం పోయింది కాదు. ఏ బంధువులతో మాట్లాడినా, అనుమానమే! ఏ స్నేహితురాలింటికి వెళ్ళినా భయమే! ఆయన భయమే నన్ను పుట్టింటికి తరిమింది; నా పుట్టింటకూడా నాకు మనశ్శాంతి లేకపోయింది. అమ్మలక్కలు నన్ను చూసి నోళ్ళు నొక్కుకున్నారు. నాకేసి ముళ్ళచూపులు చూసేరు. కన్నతల్లికి సైతం నేను బరువైపోయాను. సాటి బంధువులు, చదువుకున్న యువకులు...హుం...వాళ్ళు కూడా నేనొక ఆటబొమ్మ ననుకున్నారు.

డా : నన్నునేకవిధాల మభ్యపెట్టి యిప్పుడు నీ చేతుల్లో నన్నొక కీలుబొమ్మను చేశావ్ !

ఛా : ఎవరిని ఎవరు కీలుబొమ్మను చేశారో నీకే తెలుసును ! నువ్వు గాయాలతో హాస్పిటల్‌కు రాకముందే నా హృదయంలోని గాయాలతో నే నక్కడకు చేరేను. అంతకుముందే అత్తింటికీ పుట్టింటికీ దూరమై, అనాథగా హాస్పటల్లో కాలుపెట్టేను. అడుగుపెట్టేముందు కాలి వేళ్ళకున్న మట్టెలు తీసి కన్నీళ్ళతో కడిగి దాచుకున్నాను. నా మంగళసూత్రాన్ని కళ్ళకద్దుకుని మెడలోంచితీసి అవతలపెట్టేను. నా నుదుటికుంకుమ బొట్టును నా చేతులతో నేనే చెరుపుకుని, నా కన్నీళ్ళను నా గొంతుకలోనే దిగమింగి నా జీవితంలో లేని చిరునవ్వులతో నా వార్డులోని పేషెంట్లను, పలకరించాను. (వెళ్లబోతూ) నా బ్రతుకు నే బ్రతుకుతున్నాననే ఆత్మ గౌరవంతో నన్ను నేను ఓదార్చుకున్నాను. కాని నా ప్రశాంత, ఏకాంత జీవితాన్ని కూడా నాకు దక్కకుండా చేసేవ్ ! నేను వెళ్తున్నాను. (ఒకడుగు ముందుకువేస్తుంది.)

డా : ఆగు ! ఎక్కడికి వెడతావ్ !

ఛా : నా యిష్టం వచ్చిన చోటికి ! నా కెక్కడ మనశ్శాంతి వుంటే అక్కడికి !

డా : నీ యిష్టం యీ నాలుగుగోడల మధ్యనే ! దేనికైనా, సరిహద్దులున్నాయని తెలుసుకో ఛాయా ! నేనెవర్ననుకున్నావ్ !

ఛా : నువ్వెవరివో నీ స్వభావం ఏమిటో, నాకు తెలిసే వెడు తున్నాను.

డా : (డ్రాయరులోంచి రివాల్వరుతీసి) వెడుదువుగాని ! ప్రాణాల మీాద ఆశవుంటే ముందు అలాగే లోపలకు వెళ్ళు ! అడుగు తీసి అడుగుపెట్టావా జాగ్రత్త !

ఛా : నీ బెదిరింపులకు నేను భయపడతా ననుకున్నావా ? రివాల్వారు చూపిస్తే నేను హడలిపోతా ననుకున్నావా ?

డా : యిది బెదరింపు కాదు. అవసరమైతే రివాల్వరు పేలు తుంది ! పద ! లోపలికిపద ! (రివాల్వరు వూపుతాడు)

పి : ఆ పూలపల్లకీ ఎవరిది ? ఆ ముత్యాలమేనా మనింటి ముందాగ దేం ?

పి : (ఇటుతిరిగి) ఆగుతుంది ! ఆగుతుంది ! పూలపల్లకీమీాద నిన్నూ రేగిస్తాను ! (రివాల్వరు ఎత్తి ఛాయాతో) వెళ్లు ! ముందు లోపలికి వెళ్ళు, నువ్వు !

శ్రీ : (వస్తూ) డాక్టర్ ! (జాన్ కూడా వస్తాడు)

డా : ఓఁ ! మీారా ? రండి ! రండి ! మీాకోసమే వెయిట్ చేస్తున్నాను... తాళాలు పుచ్చుకున్నారా ?

శ్రీ : పుచ్చుకున్నానులెండి !...అలా రివాల్వరు తీసి...

డా : కొంపతీసి రివాల్వరుచూసి హడలిపోయా రేమిటి మీారు ?

శ్రీ : మీారు నిజంగా పేల్చేస్తా రేమో అని గుండె నీరు విడిచి పోయింది !

డా : ఇంకా నయం ! గుండె ఆగిపోయింది కాదు ! చద్దును ! అందుకే పిచ్చివాళ్ళను ట్రీట్ చేస్తున్నప్పుడు, మీాలాంటి

వాళ్ళను, దగ్గరుండనీయం డాక్టర్లం! (పిస్టలు టేబుల్ మీద పెడతాడు.)

శ్రీ: ఏ ట్రీట్మెంటైనా మావాడికి నయమైతే చాలు.
(రివాల్వరు తీసుకుంటాడు)

ఛా: అబద్ధం!... మోసం!... హంతకుడివి!

డా: విన్నారా?... ఆ పిచ్చి ధోరణి! పిచ్చివాళ్లు ఎప్పుడూ యింతేనండీ! అనేక భయాలు వాళ్ళని వెంటాడతాయి; తగ్గినట్టే తగ్గి, ఆవిడకి మళ్లీ రిలాప్స్ యిచ్చిందండీ!

ఛా: నాకా పిచ్చి? నేనా పిచ్చిదాన్ని!

డా: చూశారా, శ్రీనివాసరావుగారూ! పిచ్చివాళ్ళను పిచ్చివాళ్ళంటే, వాళ్లెలా ఎగిరిపడతారో! వాళ్లేమన్నా మనం, యస్, యస్, అనడమే దానికి మందు!

శ్రీ: ఆమాట అక్షరాలా నిజం డాక్టరుగారూ!

ఛా: ఏమాట శ్రీనివాసరావుగారూ?

డా: నీమాటే నిజం! అంతా హంతకులే! నువ్వే మంచి దానివి!...చూడు. లోపల బీరువాలో కొత్త చీరలలా ఎందుకు చింపేశావ్?

ఛా: (తెల్లబోయి) నేను చింపానా? ఏమిటీ అబద్ధాలు?

డా: పోనీ, నేనే చింపేశాను!... కొత్త టీసెట్టు గోడకు విసిరికొట్టావుకదా, ఎలా చెప్పు! ఎంతో ముచ్చటపడి తెచ్చిన కొండపల్లి బొమ్మలు గుండగుండ చేశావ్, ఇదేమన్నా సంసారమనుకున్నావా, సర్కస్ కంపెనీ అనుకున్నావా?

ఛా: ఎందుకలాగ ఆరోపిస్తావ్ ?

డా: పోనీలే!...ఇంట్లో చెవలపిల్లుల్లా ఎందుకు కరిచేశావ్!

ఛా: నేనేం, నీ చేతిలో కీలుబొమ్మను కాను! ... ఏమిటీ అన్యాయం?

డా: అవును; నేనే నీ చేతిలో పిండిబొమ్మను! సరేనా? ... ముందు లోపలికి పద!

[ డాక్టరు, ఛాయను బలవంతిగా లోపలకు నెట్టుకుపోతాడు. అక్కడ ఆమెను గదిలోకి నెట్టే ప్రయత్నంలో వున్నట్లు, తలుపులు, తెరిచిన, వేసిన ధ్వని. పిచ్చివాడు కోపంతో అటు వెళ్లబోతాడు. శ్రీనివాసరావు వద్దని వారిస్తాడు. ]

శ్రీ: మోహన్! ఎందుకంత తొందర ?

మో: ఆ విషసర్పం ఆమెనొక పిచ్చిదాన్ని చేసి అలాగ విష వలయంలో నిర్బంధిస్తూంటే, చూస్తూ వూరుకోమంటావా? ఒక వ్యక్తిని ఇంకొకవ్యక్తి అకారణంగా బాధిస్తూవుంటే చేతులు ముడుచుకు కూర్చోవడం ధర్మమేనా?

శ్రీ: ఆమె ఎవరో, ఆమె వ్యక్తిత్వమేమిటో, ఆమె తన జీవితంలో ఎలా పతనమయిందో ఇప్పుడైనా, నీకర్థమయిందా?

మో: అయింది! అకారణంగా ఆమెను అనుమానించి వెళ్ళగొట్టాను. జీవితంలో మొదట ఆమె పతనానికి నేనే కారణం. ఆమె ఇక్కడ ప్రశాంతంగా జీవిస్తున్నదని పొరబడ్డాను!

శ్రీ: నువ్వు పొరబడ్డావనే, నువ్వెంత రానంటున్నా నిన్నిక్కడికి తీసుకువచ్చాను!...పాపం, ఆమె పతనానికి ఏమిటి కారణం?

మో: ఆమె పడుతున్న బాధలను, మనోవేదన ఆత్మసంఘర్ష ణలను కళ్ళారా చూశాను; ఆమె అలాగ గదిలో మూలుగుతూ పడివుంటే, విషవర్తులంలో చిక్కుకుని వుంటే ఇంకా నువ్వుసహించమంటావా? వాణ్ణింకా అలాగే దౌర్జన్యం చేయనిస్తావా?

శ్రీ: తొందరపడకు! కొంచెం ఓపికపట్టు!

డా: [ఇవతలకువస్తూ] అబ్బబ్బ! ఆవిడకంతా అనుమానమే! ఈ పిచ్చేవాళ్లతో నాప్రాణం విసిగెత్తిపోతోంది!

శ్రీ: డాక్టర్లకీ బాధలు తప్పవ్! ఇంట్లో పేషెంట్లు వుంటే మరీని!

డా: ఒకొక్క పేషెంటు, ఒకొక్క రకంగా వుంటాడు! ఎన్ని యింజక్షన్లు యిచ్చేండి! బ్రెయినుకెంత కరెంటు ఎక్కించండి! తగ్గినట్టే తగ్గి, ఒక్కనిమిషంలో మళ్ళీ యిట్టే ప్రకోపిస్తుంది!

శ్రీ: (సంచిలోంచి పళ్లుతీసి) మావాడికి పళ్లివ్వ వచ్చా డాక్టరుగారూ?

డా: ఇప్పుడప్పుడే వద్దు! ట్రీటుమెంట్ సగం అవుతుంటే మీరు వచ్చేరు; పూర్తయాక యిద్దాం! (జేబులోంచినోట్లు తీసి పిచ్చివాడికి చూపిస్తూ) ఏయ్, మిష్టర్! ఇటొక్కసారి చూడు!...నా చేతిలోని వేమిటి?

పి: డబ్బు...డబ్బు!...డబ్బుకి ఉబ్బసం పట్టుకుంది... ...నాకో రూపాయి యివ్వవూ!

డా: చూశారా! ఎంత పిచ్చివాడికైనా, డబ్బుచూపిస్తే ఆశపుడుతుంది!

శ్రీ: ఇప్పుడు చాలానయం! పూర్వం అమాత్రంకూడా పోల్చుకోలేకపోయేవాడు!

డా: (ద్రాక్షపళ్లు చూపించి) ఇవి ఏపళ్ళు?

పి: పళ్లూడగొడతాను!... కిటికీదగ్గర నిలబడి అలా తొంగి చూస్తావేం? ఏమిటా గుసగుసలు?...

డా: చంపేశాడు! మళ్ళీ భార్యమీద అనుమానంలోకి దిగిపోయాడు శ్రీనివాసరావుగారూ! చూడు! ఇలు చూడు! ఈ కిటికీదగ్గర ఎవరూ నుంచోలేదు; అనుమానం ఒక పెనుభూతం! ఈర్ష్య ఒక పిశాచం! పగ ఒక బ్రహ్మరాక్షసి! ఈ భూతాన్ని, యీ పిశాచాన్ని ఈ బ్రహ్మరాక్షసిని, నీ కళ్ళముందే, యిదిగో, యీ రివాల్వరుతో కాల్చిపారేస్తున్నాను!...శ్రీనివాస రావుగారూ! ఏదీ, ఆ రివాల్వరు యిలా యివ్వండి! మళ్ళీ ఒక షాక్ యిస్తాను! అతని భయాలన్నీ ఎక్కడి వక్కడ స్కాటరైపోతాయి! (అందుకోబోతాడు)

శ్రీ: (నవ్వుతూ) రివాల్వరు నాదగ్గరే వుండనీయండి. డాక్టరు గారూ! నేనే షాక్ తినిపిస్తాను!

డా: అహాహాఁ! అలా కాదండి; పేషెంటుకి డాక్టరు మీదున్న కాన్ఫిడెన్సు యితరులమీద ఎందుకుంటుంది? అది నా చేతిలోనే వుండాలి! ఇలా తెండి! (తొందరగా రెండడుగులు ముందుకు వస్తాడు.)

శ్రీ: డాక్టర్! ఎక్కడ నుంచున్నావో అక్కడే నించో! అడుగు ముందుకు వేశావా జాగ్రత్త! జబ్బు కుదర్చ

మని పేమెంటు నప్పగిస్తే, అతన్ని చంపుదామనుకుంటు న్నావా?

డా: ఏమిటీ కుట్ర? నా యింటికి మీరెందుకు వచ్చారు?

శ్రీ: నీయింటి కెందుకొచ్చామో నువ్వే చెప్పు! ఏమని నా దగ్గర ఫీజు పుచ్చుకున్నావ్?

డా: నీదగ్గర నేను ఫీజు పుచ్చుకున్నానా? నాదగ్గర ఎందుకీ వేషాలు? దొంగలు! మీరు బందిపోటు దొంగలు! చేతిలో ఆ రివాల్వరు యేమిటి?

శ్రీ: ఈ రివాల్వరు నీదే!

డా: నాదా? హఠాత్తుగా నాయింటి మీదపడి నన్ను బెదిరించి నాయింటిని దోచుకుందుకు వచ్చారు!

శ్రీ: మేం దొంగలమని తెలుసు కుందుకు నీకింతసేపు పట్టిందా? గొప్ప సైకాలజిస్టువి! నువ్వా మాత్రం వెంటనే పోల్చుకుంటే మాకింత ట్రబుల్ వుండకపోను!

డా: ఒహో, అలాగా? (ముందుకు రెండడుగులు వేస్తాడు.)

శ్రీ: కదిలావా, యీ రివాల్వరు వూరుకోదు; ఏవీ, ఆతాళాలు! యిలాతే!... ఇస్తావా? యీయవా? ఉన్నడబ్బేదో అక్కడపెట్టి నీ ప్రాణాలు దక్కించుకో!

డా: వెధవడబ్బు కోసం మనుష్యుల ప్రాణాలు తీస్తారటయ్యా? అమానుషం! పట్టుకుపో! పెటీయెహాంట్!

శ్రీ: ఇంటి యజమానికి ఆ మాత్రం సెన్సువుంటే దొంగలు ఎవరి జోలికీరారు! మాక్కావల్సింది డబ్బు! తియ్యి, డ్రాయరు తియ్యి! ఊఁ! ఆలస్యం చేయకు!

డా: (డ్రాయరుతీసి నోట్లు విసిరికొట్టి) పట్టుకు పో!

శ్రీ: (నోట్లు జేబులో పెట్టుకుంటూ) ఇదంతా నీకోరోజు సంపాదన! అంతా కరంటు ఎకౌంట్! నువ్వొక రోజులో గడించింది, నే నొక అరగంటలో ఎర్న్ చేశాను!

డా: దొంగల కేం లోటు! నిత్యపంట! అందరి ఎర్నింగూ మీదే!

శ్రీ: పద; మేడమీదకి పద! ఊళ్లో చందాలన్నీ ఇనప్పెట్టెలో మూలుగుతున్నాయి కాబోలు!

డా: ధర్మాత్ములు మీ రెప్పుడు వస్తారా అని, ఓ మూల మూలుగుతూ పడి ఏడుస్తున్నాయ్!

శ్రీ: ఉన్న డబ్బేదో అక్కడ పడేయ్!

డా: ఇం కేముంది? నాభి కొనుక్కుందు కూడా మిగల్చకుండా, అంతా ఊడ్చి పట్టుకు పోయావ్!

శ్రీ: పద, మేడ మీదకు పద!

[శ్రీనివాసరావు రివాల్వరు అతనిమీదకు గురిచేసి వుంచి మేడ మీదకు నడిపిస్తాడు. ఇద్దరూ మేడమీదకు వెళ్ళిపోతారు.]

మో: జ్యోతీ! జ్యోతీ! (పిలుస్తూ లోపలకు వెడతాడు. గది తలుపులు తెరచిన శబ్దం వినవస్తుంది. కొద్దిసేపు పోయాక మోహన్, జ్యోతులిద్దరూ ఇవతలకు వస్తారు.]

జ్యో: నా కంతా అయోమయం! అంధకారం!

మో: నువ్వేకాదు; ఇంతకాలం, నేనూ, అంధకారంలోనే వున్నాను! ఇకనైనా వెలుతురులోకిరా, జ్యోతీ!

జ్యో: ఈ జీవితంలో నాకే వెలుతురు లేదు! అంతా చీకటి. చీకటిమాత్రమే మిగిలింది!

మో : నీ కేచీకటీ లేదు ! నా జీవితంలో జ్యోతివైన నిన్ను పరిస్థితులు ఛాయగా, ఎలా మార్చేయో, ఇప్పుడు అర్థం చేసుకున్నాను !

జ్యో : నన్నెవ్వరూ ఛాయగా మార్చలేదు; నా జీవితాన్ని నేనే చిమ్మచీకటి చేసుకున్నాను ! నా నీడను చూసి నేనే భయపడ్డాను;...జీవితంలో మీ కెంతో అపచారం చేశాను. కట్టుకున్న భర్త వుండగా, పట్టెడన్నంకోసం, అనాథనని హాస్పటల్‌లో చేరాను. కన్యనని చెప్పకుండుకు వీలులేకుండా నేను చదువుకున్న చదువు, నేను సంపాదించిన, నా సర్టిఫికేటు అడ్డువచ్చాయి ! పిడికెడు మెతుకులకోసం, నే నెందుకు ఆ అపచారం చెయ్యాలి ? జీవితంలో యింకా ఏ అనుభవాలు మిగిలేయని యిక్కడకు రావాలి ?

మో : నీకష్టాలకూ, కడగండ్లకూ, నేనేకారణం! అకారణంగా నిన్న మానించేను ; అన్యాయంగా వెళ్ళగొట్టాను. మధుర ప్రశాంతమైన మన జీవితాన్ని, గాడ్పులలో, వాడగొట్టాను; తూలగొట్టాను. పన్నీటిజల్లులు కురిసే పూలబాటలమీాద, వడగళ్ల జడివానలు కురిపించాను. నా చుట్టూ ఆ రోజులలో, నన్నొక వున్మాదిని చేసే పన్నాగం, కుట్ర, వల వున్నదని తెలుసుకోలేకపోయాను. వాళ్ళు పన్నిన ఆ విషవలయంలో చిక్కుకున్నాను. నేనే పొరబడ్డాను. ఆ పొరబాటు పడకుండావుంటే, నీ జీవితం హాయిగావుండును. నాదే దోషం. నన్ను మన్నించు జ్యోతీ.

జ్యో : అప్పుడు మీ కపచారం చేయకపోయినా, యిప్పుడు చేశాను! నేను పతితను! నా జీవితం కలుషితమైంది! నా జీవితం, ఎలాగా అగచాట్ల పాలయింది; మీరైనా, సుఖపడండి! (కన్నీళ్లతో, లోనికి వెళ్లిపోతుంది.)

మో : జ్యోతీ! జ్యోతీ! (రెండడుగులు ముందుకుసాగి ఆగిపోతాడు. మేడ మీదనుంచి డాక్టరు గబగబా వస్తాడు.)

డా : (ఫోనుతీసి) హాలోహాలో!... నెంబరువన్ పోలీసు స్టేషన్! యస్; ప్లీజ్! నేనూ, డాక్టర్ శ్రీరామ్! ఇనస్పెక్టరుగారా!...ట్రీట్‌మెంట్ పేరుతో పిచ్చివాణ్ణొకణ్ణి వెంటబెట్టుకునచ్చి హఠాత్తుగా రివాల్వరుతో మీద పడి చంపుతానని బెదిరించి, ఇల్లంతా దోచుకుందామని ప్రయత్నించాడు! దొంగ మేడమీద గదిలో యిన ప్పెట్టెను దోచుకుంటూంటే ఎలాగో కష్టంమీద ఆ గది తాళం బిగించగలిగేను! (ఫోనుదించి పిచ్చివాడికేసిచూచి చిరునవ్వుతో) డబ్బు చేతికి చిక్కిందనుకుంటున్నాడు రోగ్! నా ట్రేప్‌లో నైస్‌గా పడ్డాడు!

మో : శ్రీరామ్! నువ్వు ఫోనుచెయ్యకుండానే నీ యింటి చుట్టూ పోలీసులు కాపలా కూర్చున్నారు! అతను నీ ట్రేప్‌లో నైస్‌గా పడ్డాడా? అతినెవరనుకున్నావ్? పోలీసు ఆఫీసర్ని దొంగనుకుని గదిలోపెట్టి బంధించావా? ఏగదిలో బంధించావో పద! తాళంతియ్యి! (రివాల్వరు చూపిస్తూ) ఊఁ! పద! వెనక్కి తిరుగు! మేడమీదకుపద! డోన్టిడిలే! (డాక్టర్ని ఒక్కొక్కడుగు మేడమీదకు తరుముతాడు. ఒకక్షణంలో ముగ్గురూ మేడ దిగొస్తారు.)

శ్రీ: నన్ను లాకప్‌లో పెట్టి నైటు గౌనుతో డుక్కుని, క్రాపు చెరుపుకుని పోలీసులకు ఫోన్ చేశావా? అసాధారణ ప్రజ్ఞా దురంధరుడివి! ఇంకా ఎంతమందిని, వుక్కిరిబిక్కిరి చేస్తావ్? పద! పోలీసులు నీకోసం వెయిట్ చేస్తున్నారు.

డా: పోలీసుల పేరు చెబితే నేను హడలిపోతాననుకుంటు న్నావా? నీ బెదిరింపులకు భయపడేవాణ్ణికాదు! నే నెవర్నో తెలుసా?

శ్రీ: తెలుసు! .. అబ్దుల్ కలాం హుస్సేన్ సాహెబ్ జీ! శేఠ్ వినాయక దౌలత్ రాం! ఫ్రాంక్ ఆంథోనీ! ఇంకెన్ని పేర్లున్నాయో కాని, ప్రస్తుతం తమరు డాక్టర్ శ్రీరామ్, యం. డి. వియన్నా!

డా: ఏమిటీ సహస్రనామపూజ? నీకేమైనా, మతిపోయిందా?

శ్రీ: నీ దృష్టికి మనుష్యులందరూ మతిపోయినట్టే కనిపిస్తారు! హైద్రాబాద్, కలకత్తా, పూనా, పుదుచ్చేరీలలో విజయ యాత్ర అవలీలగా సాగించావు! ఇప్పుడీ చిన్న చిన్న పట్టణాలు మిగిలిపోయాయి! కదూ?

డా: ఇండియాలో నగరాల పేర్లు బైహార్టు చేసినట్టున్నావే! ఆ నగరా లెక్కడున్నాయో మేప్ పట్టుకొస్తాను చూపిస్తావా?

శ్రీ: అక్కడ నువ్వు చేసిన మాయలూ, మోసాలూ, ఇంకా రహస్యంగానే వున్నాయనుకుంటున్నావా? హైదరా బాదులో నువ్వు.....

డా: మీనింగ్ లెస్! ఏమిటా వాగుడు?

శ్రీ: సెంట్రల్ మినిస్టరు బ్రదరునని పెద్దస్టేటస్ మెయింటైన్ చేసి పెర్మిట్లూ, గ్రాంట్లూ, లైసెన్సులూ, ఉద్యోగాలూ, స్కాలర్ షిప్‌లూ, ప్రభుత్వమంతా నీ చేతుల్లో నేవున్నట్లు, వాటిని పంచిపెడతానని, హైదరాబాదులో ఒక వెలుగు వెలిగావు! బొంబాయిలో సేఠ్ దౌలత్ రామ్ మెక్డొనాల్డ్ లిమిటెడ్ కంపెనీ అనేబోర్డు తగిలిగించి, ఇంటర్ నేషనల్ రెప్యుటేషన్ వుందని, షేర్లమ్మి, ఎందర్నో బోల్తా కొట్టించావు! పుదుచ్చేరిలో ఫ్రాంక్ ఆంథోనీగా, పారిస్ లిక్కర్, ఫ్రెంచి గోల్డూ, స్మగుల్ చేసి, యిండియన్ ఏరియాతో బిజినెస్ రిలేషన్సు పెట్టుకున్నావు! అక్కడ దేశభక్తుడిలా పోజుపెట్టి, నిజంగా దేశంకోసం పాటుపడే వాళ్లలో సైతం చలామణీ అయ్యావు! నీకూ, నీ స్మగిలింగ్ పార్ట్‌నర్స్‌కీ పంపకాల్లో పడక ఒళ్లు హూనమయితే, గాయాల్తో హాస్పటలు చేరావు! డాక్టర్నని, దేశభక్తుణ్ణనీ, అమాయకురాలు, ఛాయాదేవిని మోసం చేశావ్!

డా: మోసం మోసం అంటున్నావ్! నేనెవర్నీ మోసగించలేదు! నన్నెవరనుకుని పొరబడుతున్నావో ఏమో!

శ్రీ: నిన్ను నాకు బాగా తెలుసును! ఎన్ని అవతారాలు ఎత్తినా, మనిషి ఒక్కడే!

డా: ఇంతకీ తమరెవరు?

శ్రీ: ప్రభుత్వోద్యోగిని!

డా: ఓహో! చిత్రగుప్తుడివా?

శ్రీ: చిత్రగుప్తుడి చిత్తా, రైట్‌గా వుంది!

డా: నీ చిత్తాలో ఒకర్ని బదులు యింకొకర్ని జమచేసి వుంటావ్! నా పేరు ఖుర్చురాసుకో! యూ ఆర్ మిస్టేకెన్!

శ్రీ: నో, నో, నో! మేం పోలీసు అధికారులం! పొరబడం!

డా: మహా మహా, యమకింకరులే, ఒకణ్ణి పట్టుకోబోయి, ఇంకొకణ్ణి పట్టుకుపోతారు! ఆఫ్టరాల్ మీ రనగా ఎంత, కేవలం పోలీసులు!

శ్రీ: మినిష్టరు మిత్రుణ్ణని ప్రకాశరావు దగ్గర పుచ్చుకున్న పదివేలూ, నీ నేరాన్ని రుజువుచేయడానికి చాలుననుకుంటాను!

[అంటూ చప్పట్లుకొడతాడు. ప్రవేశం: ప్రకాశరావు]

ప్ర: సమస్తే డాక్టర్ సాబ్!

డా: దయచేయండి! దయచేయండి! మీ పర్మిటు సంపాదించడం కోసం మీరు నన్నే పట్టుకోవాలా? ఎంతమంది గొప్పవాళ్లులేరు?

శ్రీ: హుఁ! లోకంలో, ఎవరి కళ్ళుకప్పినా, న్యాయశాస్త్రం కళ్లు కప్పలేవు! పద! అక్కడే నీ నేరం రుజువౌతుంది!

డా: న్యాయం, శాస్త్రం, నేరం, ఋజువు! ఎవరు నేరం చేస్తున్నారు? ఏ న్యాయం ఋజువు చేస్తోంది? న్యాయశాస్త్రంలో నిజంగా న్యాయమేవుంటే సమాజంలో యింతమంది పెద్దమనుష్యులుండగా వీళ్ళను వదలిపెట్టి నన్ను శిక్షిస్తుందా?

శ్రీ: సమాజంలో నీలాంటి వాళ్లెందరో మహానుభావులు! నిన్న ఒకడు ... ఇవాళ నువ్వు ... రేపు మరొకడు ... ఎప్పుడో ఒకప్పుడు, ఎవరికో ఒకరికి, సమాధానం చెప్పకోక తప్పదు!

డా: ఈ వెర్రిమొర్రి వేదాంతాలు, నాదగ్గర చెప్పకు! నేనెవరికీ సమాధానం చెప్పకోనక్కరలేదు! వాళ్లే నాకు సమాధానం చెప్పకోవాలి! వడ్డీలకు వడ్డీలు పెంచి, తాకట్టులు వాకట్టులు చేసి, నలుగురి ఆస్తులూ పడవేసుకుని అంతస్థుల మీద అంతస్థులు కట్టి, కులుకుతూ కూర్చున్నవాడు యీ సంఘానికి అయివేజు! ఒకరి నోటి ముందు అన్నం పడగొట్టి, జన్మానికొకసారి పదిమంది బికారులకింత కబళం పడేస్తే, వాడు నిరతాన్న ప్రదాత! కనిపించినవాణ్ణల్లా ఆర్చి, అందరి కొంపలూ తీసి ఒక దేవాలయం కట్టిస్తే, వాడు పరమ భాగవతోత్తముడు!... ఒకడు ఫ్యాక్టరీ మీద ఫ్యాక్టరీ కట్టి, ఇతరుల జీవితాలను రూపాయలుగా మార్చి, వాటిని ఖంగ్‌మని మ్రోగిస్తూ కూర్చుంటే ఆ మ్రోతకు, నీ న్యాయ శాస్త్రం చెవులు గింగురుమంటాయ్! అతని కరెన్సీ తళతళలకి దానికళ్లు రెండూ చెదిరిపోతాయ్! కాటన్ మార్కెట్టులో ఒక రోజులో కొన్ని లక్షలు కొట్టేసి సామాన్యుల జీవితంతో జూదమాడే బ్యాంకర్లు ఈ సంఘానికి పిల్లర్స్! వాళ్ళను నీ "లా" పుస్తకాలు తమ రెక్కల కిందకు తెచ్చుకుని ప్రొటెక్ట్ చేస్తాయి! దొంగ నోట్లు అచ్చువేయించి వాటిని చలామణిచేసి పట్టుబడ

కుండా సముద్రంలో మిషను పారేసి బ్యాక్ కార్లో గుమ్ము రేపుకుంటూ తిరిగే కుబేరులు, ఈ సమాజానికి ఇల వేల్పులు!...ఈ పెద్దమనుష్యులు చేసింది పబ్లిక్ ఛీటింగ్ కాదు! వీళ్ళెక్కడికెళ్ళినా పబ్లిక్ ఫంక్షన్స్! ఏంచేసినా అది దేశసేవ! వీళ్ళని గురించి ఏంచెప్పినా నీ'లా'కి బ్రహ్మచెముడు! వాళ్ళు చేసేపనులు దానికి చూపించా లంటే అది కళ్ళులేని కబోది! దొరికినవాడు దొంగ; దొరకనివాడు దొర! ఎవరుదొంగలో, ఎవరుదొరలో, నేనే అడుగుతాను! పద, మిస్టర్ శ్రీనివాసరావ్! పద! నేనే వస్తాను!

శ్రీ: పదిమందిని హత్యచేసిన హంతకుడు సైతం తనకు ఉరిశిక్ష విధించిన జడ్జీని "నువ్వు నా కురిశిక్ష వేసి ప్రాణాలు తీస్తున్నావ్, నన్ను హత్యచేస్తున్న నువ్వుమాత్రం హంత కుడివి కావా?" అని ప్రశ్నిస్తాడు! సమాజాన్ని నువ్వూ అలాగే అడుగుతున్నావు మిస్టర్ శ్రీరామ్!

[లోపల బీరువా చప్పుడు; "అమ్మగారూ! అమ్మగారూ...... విషం; విషం!" అనే జాన్ అరుపులూ వినిపిస్తాయి.]

మో: జ్యోతీ!...జ్యోతీ!...విషం! (లోపలకు పరుగెత్తుతాడు)

శ్రీ: మోహన్!...మోహన్! (తానూ వెడుతూ డగా జాన్ విషం సీసా పట్టుకొని ఒక ప్రక్కనుంచి వస్తాడు. మరో ప్రక్క నుంచి మోహన్, జ్యోతి వస్తారు.)

మో: ఏమిటి, జ్యోతీ యిది? ఎందుకు నీకీ నిరాశ?

శ్రీ: జీవితంలో ఎన్ని ఒడుదుడుకులు వచ్చినా భరించాలి కాని, ఆత్మహత్య చేసుకుంటారటమ్మా!

జా : అమ్మగారలాగే కూచుని, కూచుని ఏదో అనుకుంటూ ఒక్కసారి గబుక్కున బీరువాదగ్గరకు వెళ్లారు! ఎంత పెనుగులాడినా, ఎంతకూ సీసా, నా చేతికి దొరకలేదు!

[విషపుసీసా డ్రాయరుమీద పెడతాడు.]

మో : నన్ను మన్నించు, జ్యోతీ! పవిత్రమైన నీ హృదయాన్ని అర్థంచేసుకోలేకపోయాను! నా నట్టింట వెలిగే జ్యోతిని నిలుపులోలేకపోయాను! నా జీవితాన్ని నేనే చిమ్మచీకటి చేసుకున్నాను!... మళ్ళీ నా హృదయ ప్రాంగణంలో జ్యోతులు వెలిగించి, నా జీవితాన్ని పునీతం చెయ్యి!

జ్యో : నేను, పతితను! అపవిత్రమైన నా పాదం, ఎక్కడ మోపినా, అది కళంకిత మౌతుంది!

మో : కాదు, జ్యోతీ! పునీతమౌతుంది! పగతో, కుట్రతో, ఈర్ష్యతో, ద్వేషంతో వెర్రితలలువేసి, కొద్దిమందిగల ఏ కూటమి మనల్ని వేరుచేసిందో, దాన్ని బహిష్కరిద్దాం!

జ్యో : ఇప్పుడు నిజంగానే, నన్ను సమాజం బహిష్కరిస్తుంది! నాకు ఆశ్రయమిచ్చి, మీరు సమాజానికి...

మో : ఏ సమాజం నిన్ను బహిష్కరిస్తుంది? జీవితంలో అనేక పరిస్థితులవలన, పతనమౌతున్న వ్యక్తులు ఎప్పుడూ అలాగే పడివుండాలని ఏ సమాజం శాసిస్తుంది? వాళ్లు మానవులుగా ప్రశాంతంగా జీవించడానికి హక్కు లేదని

ఏ సమాజం నిర్దేశిస్తుంది ? అలాంటి సమాజాన్ని కాదని ప్రతిఘటించే హక్కు నాకూవుంది !

[జ్యోతి మౌనంగా తల వంచుకుంటుంది. పంజరంలోని చిలుక 'అత్తగారొచ్చారు పీట వెయ్యి! పెళ్లి వారొచ్చారు విడిదియ్యి" అంటుంది.]

డా : మిస్టర్, శ్రీనివాసరావ్, పద ! పోలీసులు, మనకోసం వెయిట్ చేస్తున్నారేమో ! పద ! (అంటూ డ్రాయిరు మీద వున్న సీసా తీసి, విషం గుటుక్కున మింగుతాడు.)

జా : (డాక్టరు విషం త్రాగడం గమనించి) విషం ! విషం !

శ్రీ : ఈమాత్రందానికి ఎందుకిన్ని శ్రమలు పడ్డావ్ ! మరణిస్తే మిగిలేది డబ్బుకాదు; మంచి చెడ్డలు !

డా : (నవ్వి) ఆ మాటలు నా కెందుకు చెబుతావ్ ? ఈ వేదాంతమంతా తెలిసి ఇంకా కోటికి పడగలెత్తుతున్న కుబేరులకు చెప్పు ! (కుర్చీలో కూలబడిపోయి, డ్రాయరుమీదకు వొరిగిపోతాడు.)

మో : అది కాలం చెబుతుంది !

డా : జాన్ ! జాన్ !... (తనచేతి గడియారాన్ని చూస్తూ, చూపిస్తూ) హుఁ !...ఇదొక్కటే నాకు మిగిలింది;...ఇదిగో ! తీసుకో ఈ రిస్టువాచీ...కాలం చెబుతుంది !

తెర

*

# నేపథ్యగీతం*

పంజరమ్మున నున్న పక్షికి
ప్రాణమున్నను ఏమి లాభం?
పంజరమ్మున నున్న ప్రాణికి
ఎన్నివున్నను లేదు సౌఖ్యం!

జట్టుకట్టుకు చెట్టు చెట్టుకు
ఏటి చల్లని నీటి గాలుల
నింగి నడుమను నీడ పరుచుకు
నీలి మబ్బుల పడవ మీదను
బాసలాడుతు పాట పాడుతు
బారు బారుల పోవు పిట్టల
పంజరమ్మున పట్టివుంచిన
ప్రాణమున్నను ఏమి సౌఖ్యం?

మనిషి పుట్టుక గొప్ప మరిచీ
బతుకుతీపిని చేదుచేసీ
అన్ని యిచ్చిన అమృత మిచ్చిన
అంతకన్నను లేదు నరకం!

---

* నాటక ప్రదర్శనానికి ముందు; లేదా ఛాయా పాత్రను, ఔచితిని గమనించి కొన్ని సన్నివేశాలలో ఈ నేపథ్యగీతాన్ని ప్రయోక్తలు ఉపయోగించుకోవచ్చును.

భావమును బంధముల కట్టకు
బందిఖానా అగును బతుకు !
బతుకుతీపిని చేదుచేయకు
బతుకు మంచికి దారి వెదకుము !

మతిని గొలుసుల పట్టి వుంచక
మంచితసమున మనసు వొంచుము !
మదిని యింపుగ రాగమలరగ
మితిని ఎరిగీ మతిని మీటుము !




TPLA121B 200





## గ్రంథకర్త

కథకుడు, కవీ, నాటక రచయిత. జననం 1923. జన్మస్థానం కాకినాడ తాలూకా పండూరు. పట్టభద్రులు. కడలూరులో ఏడాదికిపైగా కారాగారవాసం. 'విశాలాంధ్ర' దినపత్రిక సబ్ఎడిటరుగా పనిచేశారు. 'పంజరం' రచనకు ఆంధ్ర నాటక కళాపరిషత్తువారు బహుమతి ఇ[illegible]రు.

వీరి యితర రచనలు : ఆకాశ దీపాలు (కథలు); అవసరాల కథలు (కథలు); మహాకవి గురజాడ రచనలు (వ్యాసచంద్రిక, డైరీలు, మాటా : మంతీ : అవీ : ఇవీ. ) సంకలనం.

స్వతంత్ర ఆర్టు ప్రింటర్సు, విజయవాడ-2



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA121B200 |
| పుస్తకం పేరు | పరిహృతి |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 121 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | 117 ,CI |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినవది | munisha |
| పేజీలు విడదీసినవది | munisha |
| స్కాన్ చేసినవది | Hema |
| పరీక్ష చేసినవది | DAVEED |
| పేజీలు సరిచూసినవది | |
| బైండింగు చేసినవది | |
| ప్యాకింగు చేసినవది | |
| పరిస్థితి | Good |